# నర్మద

(నవల)

శ్రీ సుధ




జయంతి పబ్లికేషన్స్
గోపాలరెడ్డిరోడ్డు :: విజయవాడ-2

# నర్మద

నర్మద పక్క బెర్తుమీద పడుకొని నిద్రపోతోంది. నిద్రలో చిరునవ్వులు కురిపిస్తున్న సినీతార నర్మదకూ, చిన్నప్పటి నా సహాధ్యాయిని నర్మదకూ ఎంత తేడా వుందా అని ఆలోచించసాగాను.

నర్మద చిన్నప్పటి క్లాసులలో నా క్లాసుమేట్. క్లాసులో మూగనోము పట్టి ఇంటిదగ్గర తెగఅల్లరిచేసే నర్మదకూ నాకూ స్నేహం-అంటే గాఢమైన స్నేహం. ఆ స్నేహం విచిత్రమైన సన్నివేశంతో ప్రారంభమది. అవి నేను ఎనిమిదవ క్లాసు చదువుతున్న రోజులు. నా స్నేహితుడు 5 అడుగుల 6 అంగుళాల క్రిస్టఫర్, 4 అడుగుల 3 అంగుళాల నర్మదను ఏదో అన్నాడని నర్మద వెళ్ళి హెడ్మాస్టరుగారితో రిపోర్టు చేసింది. పాపం ఆయనకు క్రిస్టఫర్ అంటే వల్లమాలిన భయం. అటు వాణ్ని పిలిచి తిట్టటానికి భయం - ఇటు నర్మదకు సమాధానం చెప్పలేమే అని ఆత్రుత. ఇంక ఈ పిరికి హెడ్మాస్టరుతో చెప్పుకొని లాభంలేదు అనుకొంది కాబోలు మరుసటి రోజు స్కూలు నుంచి తిరిగివస్తూంటే వాళ్ళింటి మేడపైనుంచి చెంబెడు నీళ్ళు గుమ్మరించింది మా మీద. ఆ నీళ్ళు నామీద కూడా పడ్డాయి. నాకు కోపం ఆగక గబగబ పైకి ఎక్కి వాళ్ళ నాన్నగారితో చెప్పాను. ఆయనంతా విచారించి వాళ్ళమ్మాయిని నాలుగు తిట్టి లోపలికి పంపారు. ఆ మరుసటి రోజు నా వంక

జాలిగా చూడటం ప్రారంభించింది నర్మద. నేను నవ్వాను. అలా కలిసింది మా స్నేహం. నర్మద నాట్యం చేస్తుంది. తండ్రిగారి ప్రోత్సాహంతో నాట్యంలో ఉన్నతస్థితికొచ్చింది చిన్నతనంలోనే. ఆ తరువాత నేను పైచదువులకి పరాయి వూరు కెళ్ళిపోవటం, నర్మద నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అయి పోవటం జరిగింది. ఆతర్వాత పత్రికలలో నర్మద సమాచారం చూసా. ఒక దీపావళిరోజున గ్రీటింగ్ కార్డు పంపా. వెంటనే కలుసుకోమని టెలిగ్రాం యిచ్చింది. నేను గవర్నమెంటు ఉద్యోగస్థుడిని. కావాలన్నప్పుడు విముక్తి నాకెక్కడ లభిస్తుంది? అదేవిధంగా రాశాను. తర్వాత అకస్మాత్తుగా ఇంటికొచ్చి నన్ను హడలగొట్టింది. 5 అడుగుల 4 అంగుళాల నర్మదనుచూడగానే నాకెంతోహాయి అనిపించింది. చిన్నపుడుపొట్టీ! అని ఏడిపించేవాళ్లం. వెంటనే మద్రాసుకు ప్రయాణం కట్టా నర్మదతో. పక్క బెర్తుమీద నర్మద నిద్రపోతుంటే చూస్తూ కూర్చున్నా. నర్మద కదలింది. రైలు ప్రకృతి ప్రశాంతతను, నిద్రపోతున్న నిశిని మేల్కొలుపుతూ పోతున్నది. అలవాటైన సిగరెట్టుకూడా వెగటు పుట్టింది. సిగరెట్టు బయటపారేసి కండక్టరుకు టీ ఆర్డరిచ్చి కంపార్టుమెంటులోకి పోయి కూర్చున్నా. నర్మద లేచి "నిద్రలో గూడ నువ్వే కనపడ్డావ్" అంటూ నవ్వింది. నేనూ నవ్వాను. "నువ్వు చాలా మారిపోయావ్ సుమా!" అంది. "అక్కడికి నువ్వు మారనట్లు" అన్నా. ఇంతలో టీతెచ్చి ఇచ్చాడు కండక్టర్. డబ్బులు నేనిస్తుంటే పర్సు లాక్కుని తన డబ్బుయిచ్చింది. నేను నవ్వి టీ త్రాగాను.

కాళీ కప్పులు వెళ్ళిపోయాక – "సంగతులు ఏమిటీ?" అనిఅడిగా "ఏమున్నాయి! ఈ ప్రపంచంలోంచి మరో ప్రపంచంలోకి అడుగుపెట్టినట్లే అంతా వింత డాంబికత్వంతో నిండిపోయిందనుకో"-అంది-"నిజంగా నర్మదా-నువ్వు మారిపోయావు-చిన్నప్పటి అమాయకత్వం నీలో లేదుసుమా-" అన్నా.

"మిత్రమా! పరిస్థితులకు బానిసైతే మానవుడు మారిపోతాడుగా" అంది. "నిజంగా నీలో అనుభవం తొంగి చూస్తుంది సుమా" అని అన్నా. "అబ్బబ్బ నన్ను విసిగిస్తున్నావు. చూడు, నీవడగబోయే ప్రశ్నలు నాకు తెలుసు-నాలో మార్పు నేను కావాలనే తెచ్చుకున్నాను. ఆ మార్పు లేకపోతే నేనీ పరిస్థితులలో ఉండక పోదును. నేనడుగుపెట్టింది మరో ప్రపంచం తెలిసిందా"-అంది.

ఈ మాటలు చెప్తున్నపుడు నర్మద నాకెంతో అందంగా కనిపించింది. అలా ఆమెని చూస్తున్నపుడు నర్మద నన్నుచూచి ఏమిటి అలా చూస్తున్నావు-అని అడిగింది. "అబ్బే ఏమీలేదు. ఊరికినే" అన్నా. "నిజంగా నిన్నుచూస్తుంటే ఒక్క గొప్ప సినిమాతారను చూడటంలేదు-మామూలు అయిన నర్మదనుచూస్తున్నాననిపిస్తుంది" అన్నా. "బ్రతికించావుఇంకో మాట అనలేదు-సరేకాని నీవు పెళ్ళెందుకు చేసుకోలేదూ?" అని అడిగింది. "నాకువచ్చేజీతం నాకే చాలటంలేదు. ఇంక పెళ్ళాం పిల్లల్నేం పోషించమంటావ్" అన్నా.

"సంసారంలో పడ్డాక అదేచాల్తుందిలే"-అంది. "నిజమే అనుకో-కాని ఎందుకో అప్పుడే పెళ్ళిచేసికో కూడదని నిశ్చయించుకున్నా"-అన్నా.

"అర్థంకాని నిశ్చయాలు పెట్టుకోడం కూడా అలవర్చుకున్నావన్నమాట" అంది.

"సరేలే-ప్రస్తుతం పిక్చరుకు ఎంత ఇస్తున్నారూ ?" ప్రశ్నించా సంభాషణ మార్చే ఉద్దేశ్యంతో.

"బ్లాక్ మనీయా? వైట్ మనీయా?" అని అడిగింది. నవ్వుతూ.

"అయితే బ్లాక్ మనీకూడా పుచ్చుకుంటున్నావన్నమాట"-అన్నా.

"పుచ్చుకోక మడికట్టుకు కూర్చోమంటావా ?-"అంది.

"పోనీలే ఆ గొడవెందుకు కానీ - ఏదైనా పిక్చరుకు పెట్టుబడి పెట్టున్నావా"-అన్నా.

"అబ్బేలేదు బాబూ-ఆ రొంపిలో దిగబడ దలుచుకోలేదు"-అంది.-

"అయితే-మీ బంధువు లెవరూ నీ ఇంట్లో ఉండటం లేదూ?" అని అడిగా-నాకు తెలిసిన నర్మద బంధువులను జ్ఞప్తికి తెచ్చుకుంటూ. "కాస్త నేను పైకివచ్చేసరికి నా చుట్టూ మూగారనుకో. కానీ నేను వాళ్ళను చేరదీయలేదు. కొంతమంది నాగురించి చెడుప్రచారం కూడా చేశారు. కొంతమంది ప్రాధేయపడుతూ సహాయం చేయమని వ్రాశారు. మరికొంతమంది ఫలానా ప్రొడ్యూసర్ నేను చెపితే తనని

బుక్ చేసుకుంటారని ఒకటేమిటి నానా చెత్తంతా వ్రాశా రనుకో-" అంది.

"పెళ్ళిచేసుకోమని ఎవ్వరూ రాయలా!" అన్నా నవ్వుతూ.

"అవి నేను చదువనే చదువను. అన్నీ చెత్తబుట్ట దాఖలే" అంది.

"మరి నీవెందుకు పెళ్ళిచేసుకోలేదు ?" అన్నా.

"పెళ్ళా ?" అంది ఆశ్చర్యంగా.

"ఏం?" అన్నా అర్థంగాక.

"ఏముంది? పెళ్ళిచేసుకోడానికి అవకాశంలేదు నేనున్న రంగంలో" అంది.

"పెళ్ళిచేసుకొనే వాళ్ళంతా?" అన్నా.

"వాళ్ళ అభిప్రాయాలు, అవకాశాలు ఏకీభవించి ఉంటాయి" అంది.

"నేను నీతో వస్తున్నాకదా, ఈ నాక్రొత్తజీవితం ఎలా అంతమవుతుందో" అన్నా ఆలోచనగా.

"ఊహించు - కథకుడివిగా" అంది.

"ఊహించడానికి ఆస్కారం లేకుండా ఉంది" అన్నా.

"ఏం?" అంది.

"ఏముంది? ముందు జరుగబోయేది ఏమిటో నాకు తెలియనిస్తేగా!" అన్నా.

"ఏముంది! నా దగ్గర ఉండిపో. ఉత్సాహం ఉంటే సినిమాలో చేరుదువుగాని, లేకుంటే - రోజూ క్లబ్బుకెళ్లు, నీ ఇష్టంవచ్చినట్లు చేయి" అంది.

"అంతా నువ్వే చెప్పేస్తున్నావు. నువ్వు చెప్పిందానికి నంగీకరించకపోతే—" అన్నా.

"ఏం? నిన్నేం బరువు ఎత్తుకోమనలేదే!" అంది.

"నేను చదివిన చదువు, నా మనసు నన్ను నీవు చెప్పి నట్లు చేయనిస్తుందా?" అన్నా.

"అయితే ఇంకో ఐడియా – ఎట్లాగూ నా స్నేహితుల దగ్గర నీకు కావలసిన పేషెంట్లున్నాయి. వాటికి కావాల్సిన ట్రీట్ మెంట్ చేస్తూ నీవు కాలం గడుపు" అంది నవ్వుతూ.

"నర్మదా ఒక్క మాట" అన్నా సీరియస్ గా.

"కోపం వచ్చిందా?" అంది.

"అబ్బే కోపంకాదు. నన్ను ఇట్లా హఠాత్తుగా బయలు దేర మనటానికి కారణం ఏమిటో నాకేం అర్థం కావడం లేదు" సీరియస్ గానే అడిగా.

"చెప్పమంటావా ?–నేను ఏకాంతంగా ఉంటున్నా–ఈ ఏంకాంతాన్ని భరించలేక పోతున్నా. ఎవరైనా ఆప్తులు దగ్గరవుంటే కొంత శాంతి లభిస్తుందేమో ననిపించింది.

"ప్రతి ఒక్కరిలోను ఏదో ఒక విధమైనకల్మషం కనప డింది. ఆఖరికినీవు జ్ఞాపకం వచ్చావు.

"అందుకనేనచ్చి నీ ఉద్యోగానికి రాజీనామా ఇప్పించి తీసుకువెళుతున్నా–ఏం నీ అనుమానాన్ని తీర్చగలిగానా?" అంది.

"నాలో కల్మషం లేదని ఎలా నిర్ణయించ గలిగావ్?" అని అడిగా.

"అబ్బబ్బ! ఇవ్వాళంతా నన్ను నిద్రపోనీయలేదు. ఇదిగో వచ్చేసింది మద్రాసు. ఇంక మనింటి కెళ్ళేవరకూ నీ నర్మద కాదు గుర్తుంచుకో. సినీతార నర్మదగా వుంటా. ఏదైనా ప్రశ్న వేయదలచుకున్నప్పుడు అది ఎటువంటిదో ఆలోచించుకొని చుట్టూవున్నవాళ్ళు వేగులవాళ్ళుక్రింద గుర్తుంచుకొని మాట్లాడు ఏం-" అంది.

నిజంగా ఆశ్చర్యం వేశిందినాకు.

"ఏం అలా చూస్తున్నావ్ ? నేను బ్రతుకుతున్న జీవితం ఇటువంటిదా అని ఆశ్చర్య పడుతున్నావా?" అంది.

"ఊహూ-" అనిలేచి బట్టలు వేసుకోడానికి బాత్ రూమ్‌లోకి వెళ్ళా. నేను మళ్ళీ బయటికి వచ్చేటప్పటికి రైలు బేసిన్ బ్రిడ్జి దాటుతున్నది. కంపార్ట్‌మెంట్‌లోనికి వచ్చేటప్ప టికి నర్మద పెదిమలకు లిప్‌స్టిక్ పూలుముకుంటుంది. ఆమె తలకు కట్టిన ఎర్రనిగుడ్డలోంచి ఆమెనవ్విన చిరునవ్వు నా హృదయాన్ని కలవర పెట్టింది. "ఏమిటి అట్లా చూస్తు న్నారూ?" అని అంది.

"ఏమిటీ వింత సంబోధన !" అని అడిగా.

"ఏమనుకోకు. నీవుకూడా నన్ను మీారు అని పిలువు. ఏం" అంది లాలనగా.

"అలవాటులేని బేరం. సరేలే!" అన్నా.

"అదిగో అటువంటి మాటలే మాట్లాడకూడదు. నీవు చెప్పేప్రతివాక్యంలోనూ గాంభీర్యం ఒలికిపడుతుండాలిచూడు. స్టేషనుకు వచ్చేవాళ్ళలో రామమూర్తి గారు అనే ఆయన ఫిలిం ప్రొడ్యూసరు. నేను ప్రస్తుతం కంట్రాక్టు రాయ దల

చింది ఈయన పిక్చరుకే. అదిగో ఆ బెడ్డింగులో వుంది మూళావూ పేజీల దొంతర – ఆయన చదవమని చెప్పిన స్క్రిప్టు నీవు యింటికి వెళ్ళగానే కనీసం రోజుకో పేజీచొప్పున నెల పదిహేను రోజులలో చదువు. అంతకంటే ముందు చదవ వద్దు. ఆ తర్వాత శాబూరావుగారు అనే ఆయన ఉంటారు. ప్రస్తుతం నేను పనిచేస్తూన్న పిక్చరులలో ఈయన దొకటి. వీళ్ళంగరూ వస్తారు. వీళ్ళందరూ నిన్నేం అడగలేరు. అడిగినా ఒక చిరునవ్వు పారేయి" అంది.

"నీవు చెప్పిందంతా దేనికో అర్థం కాలే"దన్నా.

"అర్థం అవడానికేముంది? వీళ్ళంతా నాకోసం పడిగాపులు కాస్తున్న వారు. వాళ్ళను చూడగానే నీకు కంగారెత్తచ్చు. అందుకని కాస్త జాగ్రత్తగా ఉండు. ఏమాత్రం వీళ్ళకి లోకువిచ్చినా తలమీద చేయి పెట్టడం మాత్రం ఖాయం" అంది.

"ఎడమ చెయ్యా, కుడిచెయ్యా" అన్నా నవ్వుతూ.

"కుడి చెయ్యయితే అనుకోనడం ఎందుకూ? అసలు వీళ్ళందర్నీ కోదండంవేయించాలి. పోనీలే! ఆ గొడవెందుకు? టై అంత బిగుతుగా వుండకూడదు" అంటూ దగ్గర కొచ్చి ముడి వదులుచేసింది.

ఏమిటో అనిపించింది. స్టేషన్‌లో రైలు ఆగింది. మా కంపార్ట్‌మెంట్ ముందర జనం మూగారు. దండలు పుచ్చుకొని యిందాక చెప్పినవాళ్ళందరూ నిలబడి వున్నారు. నర్మద బయటకు వచ్చి అందరకీ నమస్కరించింది. దండలు వేయగానే జనం చప్పట్లు కొట్టారు నాకు చప్పట్లు కొట్టాలని

పించింది. కాని సందేహించా. నన్ను చూడగానే ఆ వ్యక్తులు కొంచం ఆశ్చర్య పోయినట్లున్నారు.

నర్మద దిగగానే నేనూదిగా. నర్మద నాచేయి పుచ్చుకుని గబగబా బయటకు తీసుకువెళ్ళిపోయింది. కారులో కూర్చోగానే ఒకాయన వచ్చి, "నేను మీతో మాట్లాడటానికి మీ కారులో రమ్మంటారా?" అన్నాడు. "క్షమించండి, చాల అలసిపోయాను. స్టూడియోలో కలుసుకుందాం" అని "డ్రైవర్ పోనియ్యి"మంది. ఆయన అలా చూస్తుండగానే కారు కదిలింది. "ఆయనే రామమూర్తిగారు" అంటూ వెనక్కుచూచి, "అరె వీళ్ళందరూ నా వెనకాలే వస్తున్నారే!" అంది. "పాపం అంతగా మాట్లాడదలచుకుంటే మాట్లాడరాదూ?" అన్నా.

"సరే మీరు చెప్పినట్లే చేస్తా. డ్రైవర్ కారుఆపు" అంది. డ్రైవర్ కారుఆపాడు. డ్రైవర్ క్రిందకు దిగగానే-నా పర్సులోంచి రూపాయితీసి, "నీవింటికి వెళ్ళి సరిగ్గా పదిగంటలకురా" అంటూ వాడికిచ్చి, "మీరుకూడా ఫ్రంట్ సీటులోకి రాకూడదమూ?" అంది. నేనువెళ్ళా. కారుకదిలింది. "చూడు నీకొక జ్యోతిష్యం చెప్పనా?" అంది. "ఊ" అన్నా సిగరెట్ వెలిగిస్తూ.

"చూడు అద్దంలో మన వెనకాల వస్తున్నవారు మన డ్రైవర్ను ఆపి నీగురించి అడుగుతున్నారు అవునా?" అని అగింది.

"అడగ నిద్దూ! దీంట్లో కొంపలు మునిగే ప్రమాదం ఏముంది?" అన్నా.

కారు పోర్టికోలో ఆగింది. వెనుకనేడున్న కార్లు పోర్టికో బయటే ఆగినయి. నర్మద బయటకువచ్చి, "లోపలికి రండి. నిముషములోవచ్చి మీతో మాట్లాడతా"నని నాచేయిపుచ్చుకొని లోనికి దారితీసింది. లోపల ఫోను మ్రోగుతున్నది. ఫోను తీసుకుని, "ఇంకా నర్మదగారురాలేదు. ఇంకో గంటలోవస్తారు. అప్పుడు పిలవండి" అని ఫోనుపెట్టేసింది. నే నాశ్చర్యపోయాను. ఇదో టెక్నిక్ అనుకున్నా. డ్రాయింగ్‌రూం సర్వాంగ సుందరంగా అలంకరింపబడి వున్నది. సోఫాలమీద పులిచర్మం వేసిఉంది. గోడకు ప్రక్క నేటక రేడియోగ్రాం ఉంది. దానిమీద తొట్టిలోని బంగారు చేపలు అందంగా ఆడుకొంటున్నాయి. మా వెనకాల వచ్చినవాళ్ళంతా కూర్చున్నాక మేమిద్దరమూ లోనికి వెళ్ళాము. "ఇదిగో నీ గది. బాగుందా?"అని అడిగింది. "జమీందారయిన కథానాయకుని డ్రాయింగురూంకూడాఇంత అందంగా ఉండదు"అన్నా నేను నాఆశ్చర్యాన్ని దాచుకోలేక.

"ఛా! అంతా గాస్. నిజంగా అలా వుందా? అంది నర్మద.

"నీతోడు" అన్నా నవ్వుతూ.

"You silly" అంటూ హాండ్ బాగ్ నా బెడ్‌మీద పడేసి బయటకు వెళ్ళిపోయింది.

నా పెట్టె తెరిచా. ఏముంటాయి? కాలేజీ రోజుల్లో కుట్టించిన, రంగువెలసిపోయి తెల్లబడిన బ్లేజర్ కోటూ రంగు పోగా రంగువేయించిన బ్లూ పనామా పాంటూ, రెండునైటు పైజమాలు, రెండు లాల్చీలు—నా కథల కాగితాల దొంతర ఇవన్నీ చూడగానే నాకు విసుగుపుట్టింది.

ఇంతలో నర్మదవచ్చి "లే స్నానానికి వెళ్ళు" అంది.

నేను టవల్ తీసుకొని పోబోగా "అక్కడే పడేయవయ్యా! బాత్‌రూమ్‌లో అన్నీ వున్నాయి" అంది. బాత్‌రూం చూడగానే గంటలకొద్దీ అక్కడే కూర్చోవాలనిపించింది. మనస్సు ఆహ్లాద పడేవరకూ అక్కడే వుండి తర్వాత బయటకు వచ్చా. నా గదిలోకి వెళ్ళి ఒక నైట్ పైజమా లాల్చీ వేసుకొని అద్దం ముందు కూర్చుని సిగరెట్ వెలిగించా. అప్పుడు జ్ఞాపకం వచ్చింది, గడ్డం పెరిగిందని. ఏం చేయాలో తోచలేదు. అలా చూస్తూ కూర్చుండి పోయా. ఇంతలోకే నర్మద వచ్చి "అలా కూర్చున్నావేం?" అని అడిగింది. "ఏమీలేదు గడ్డం పెరిగింది. బ్లేడులు అయిపోయాయి" అన్నా.

"నా కనుభవమేగా నీ బద్ధకం! చిన్నప్పుడూ అంతే చొక్కాకి గుండీలులేకుండా ఎప్పుడూ తిరిగేవాడివి. గుర్తుందా?" అంది.

"గుర్తు లేకేం?" అన్నా నవ్వుతూ.

"సరేలే! టిఫిన్ చల్లారిపోతుంది. బయట వాళ్ళంతా కూర్చున్నారు. నాకు మళ్ళీ 11 గంటలకు కాల్‌షీట్ ఉంది" అంది.

"సరే పద" అని డైనింగ్ హాల్‌లోకి వెళ్లాం. ఇడ్లీ, కాఫీ అయ్యాక సిగరెట్ వెలిగించా. ఇద్దరం డ్రాయింగ్ రూం లోకి వెళ్లాం.

"స్క్రిప్ట్ చదివారా? కంట్రాక్టు రాసుకుందామా?" అని అడిగారు రామమూర్తిగారు.

"క్షమించండి. నాలుగు రోజులలో ఏసంగతీ చెప్పేస్తా. ఒకవేళ నే మార్చమంటే స్క్రిప్ట్‌లో మార్చగలరా?" అని అడిగింది నర్మద.

"ఓ! తప్పకుండా" అన్నారు రామమూర్తి గారు.

"ఇవ్వాళ కాల్‌షీట్ వుందండి" అన్నారు బాబూరావు గారనే ఆయన.

"ఒక్క నిముషం కూడా ఆలస్యం చేయను. సరిగ్గా 11 గంటలకే వస్తా" అంది.

ఇంతలోకే కాఫీలు వచ్చాయి. మళ్లీ కాఫీలు తీసుకున్నాక వెంకట్రావ్ గారు సిగరెట్లు ఆఫర్ చేశారు.

అంతా వెళ్ళిపోయాక "షాపింగ్‌కు వెళ్దామా?" అన్నాన్లేదుని గుర్తు తెచ్చుకొని.

"షాపింగ్‌కా? చంపావ్‌పో-నేను బయల్దేరితే ట్రాఫిక్-జాం అయిపోదూ" అంది.

"మరయితే నే వెళతా" అన్నా.

"మై గుడ్ గాడ్! రాత్రంతా కబుర్లతో నిద్రపోలేదు. ఇప్పుడన్నా నిద్రపోవూ?" అంది నర్మద.

నేను సమాధానం చెప్పేలోపలే వచ్చి నానోరుమూసి "వుండు ఇప్పుడేవస్తా" అంటూ ప్రక్కగదిలోకి వెళ్ళి ఫోను చేసిందెవరికో. రేడియో గ్రామ్‌లో రికార్డులు పెట్టుకుని అక్కడున్న స్క్రిప్టు చదువసాగా. రచయిత పెద్దపేరుగలవాడే. మామూలు సినిమాలలోలాగే ఒక హీరో, ఒక హీరోయిన్, ఒక విలన్, ఒక వాంప్ ఉన్నారు. అంతా బొంబే, హాలీవుడ్ టైప్-ఇంకొకళ్ళమీద ఆధారపడకుండా తెలుగు సంస్కృతి

మీద ఆధారపడి తీసే రోజులెప్పుడు వస్తాయో అనుకున్నా. స్క్రిప్టు చదవడం అయ్యేసరికి ఎవరో వచ్చి నమస్కారం చేశారు.

"ఎవరూ ?" అన్నా.

"మై టైలర్ సార్" అంటూ బట్లర్ ఇంగ్లీషు మాట్లాడటం చూసి నాకు చిర్రెత్తుకొచ్చింది.

"తెలుగువచ్చా?" అని అడిగా.

"ఓ" అన్నాడు నమ్రతగా.

"మరి మాట్లాడు" అన్నా.

"నర్మదగారు రమ్మన్నారండీ" అన్నాడు.

"పిలుస్తానుండు." అని లోపలికివెళ్తే దాసీది కనపడింది.

"నర్మదగారిని పిలువు" అన్నా.

"అమ్మగారు డ్రస్ చేసుకుంటున్నారండీ" అంది.

అక్కడేఉన్న ఓ కుర్చీలో కూర్చున్నా.

నర్మదవచ్చి, "టైలర్ రాలేదూ?" అని అడిగింది.

"వచ్చాడు, డ్రాయింగు రూములో ఉన్నాడు" అన్నా

నర్మద డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. నేను మళ్ళీ స్క్రిప్టు చదవడం మొదలుపెట్టా. కొంతసేపటికి నర్మద నన్ను పిలిచింది.

నర్మదముందు ఓ సూటుగుడ్డల దొంతరఉంది. ఏం అన్నట్లు చూచా "అలాగే నిలబడు" అంది.

నేను నిలబడ్డా. నన్ను రెండునిమిషాలు తేరిపారచూచి, "టైలర్ కొలతలు తీసుకో" అంది.

అతను కొలతలు తీసుకుంటుంటే నే నలానే నిలబడ్డా. ఎదురు తిరుగుతున్న ఆత్మను తొక్కిపట్టా.

"ఈ కలర్స్ బాగున్నాయి కదూ?" అంది నర్మద.

"ఊ" అన్నా. టైలర్ కొలతలు తీసుకొని వెళ్ళి పోయాడు.

నర్మద లేచి లోపలికి వెళ్ళిపోయింది.

నేనేం చెయ్యాలో తోచటంలేదు. నా జీవితం ముందు ముందుకు పోతే ఎలా తయారు అవుతుందో నర్మద నన్నెలా చిత్రించుకుంటుందో అర్థంకాలేదు. కొందరు నాకు సంభ వించిన పరిస్థితులలో చీకూచింతా లేకుండా ఉంటారు. కొందరు చేతకాక తిమర్ని తామే సర్వనాశనం చేసుకుంటారు. ఈ రెండు తెగలలో నేనే తెగకు చెందుతానో, నేనే స్వభావాన్ని ఎంచుకోవాలో అర్థం కావటం లేదు. 2, 3 సంవత్సరాలలో జరగని మార్పులు, నాకీ రెండురోజులలో మార్పు సంభవిం చింది. మొన్నటివరకు నేను రెండువందల జీతగాడిన్ని, ఓ పశు వుల డాక్టరును. ఈనాడు నాది అంటూ లేకపోయినా - సంఘంలో గౌరవనీయమైన వ్యక్తిగా చలామణి అవ్వడానికి కావలసిన అన్ని హంగులు ఉన్నాయి. ఇంతటితో సంతృప్తి పడాలో, లేక నేనున్న సంఘంలోనే ఇంకా పై స్థానాలకు ప్రాకులాడాలో నిర్ణయించు కోవాలి అనుకుంటూ వుండగా- నర్మదవచ్చి "ఏం? అలా కూర్చున్నావు?" అంటూ ప్రక్కనే కూర్చుంది.

"అబ్బె-ఏంలేదు రేపటినుంచి ఏం చేయాలా అని ఆలోచిస్తున్నా" అన్నా.

"బలేవాడివే-రేపుగురించి ఆలోచి స్తే మనం మనంగా బ్రతకలేం, అయినా అన్నీ తెలిసినవాడివి-అట్లా అంటావేం?" అంది.

"అంటే" అన్నా.

"ఒమర్ ఖయ్యాం ఉవాచలు గుర్తు తెచ్చుకో" అంది.

"ఒమర్ ఖయ్యాం ఉవాచలు ఒక తెగకు చెందినవాళ్లు మాత్రమే ఆలోచించ గలుగుతారు" అన్నా.

"నీతో వాదిద్దా మనే ఉందిగాని, కాల్‌షీట్ టైమ య్యింది. అదేంటి? నీగడ్డాన్ని చిత్రీపట్టలేదే?" అని అడిగింది.

"ఏం గడ్డం చేసుకోకపోతే?" అన్నా.

"గడ్డం పెరిగిన వ్యక్తులు ఓ తెగకు మాత్రమే చెందు తారు. నీవా తెగకు చెందవు" అంది.

"గడ్డం పెంచుకుంటే జీవితంలో ఓడిపోయాడని మనం ఎందుకన్వయించుకోవాలి?" అన్నా.

"ఏమో బాబూ! నా విజ్ఞానం పరిమితం. నా మెదడు బండబారి పోయింది. సరేకాని షూటింగ్‌కు రావా?" అంది.

"ఎందుకు రానూ! కాని నన్నేమని పరిచయం చేస్తా వేం?" అన్నా.

"చెప్పానుగా. నీగురించి ఎవరూ అడగరు. ఓ సింహా సనం మీద కూర్చోబెడతా. నీవో గొప్ప వ్యక్తివని వాళ్ళకు అర్థం అవుతుంది. అంతా నీ గురించి అనుకుంటారు గాని నీ గురించి నీద్వారా తెలుసుకోడానికి ఎవరూ ఇష్టపడరు, సరా" అంది.

"ఏమో! నాకేం అర్థం కాలేదు. పోనీలే నాకెందుకు గాని ఒక్క అయిదు నిముషాలాగు డ్రెస్సయి వస్తా" అన్నా.

"ఉండు బట్టలు రానీ!" అంది నర్మద.

"బట్టలేమిటీ?" అన్నా.

"టైలర్ కొలతలు తీసుకెళ్ళాడుగా. ఈపాటికి వచ్చేస్తుండాలి" అంది.

హైదరాబాద్‌లో రోజుల తరబడి తనచుట్టూ త్రిప్పే టైలర్లు గుర్తుకొచ్చారు నాకు.

"అయితే షేవింగ్ చేసుకొస్తా" అన్నా.

"ఊ" అంది.

రేడియో ప్రోగ్రామ్‌లో రికార్డులు అయిపోయాయి. టెలిఫోన్ మ్రోగింది. నర్మద రిసీవర్ ఎత్తి మాట్లాడటం చూసి నేను గదిలోకి వెళ్ళిపోయా. నా పెట్టంతా వెతకగా మూల ఓ పాతబ్లేడు దొరికింది. దాంతో ఎట్లా అయితేనేం పనిపూర్తి చేశా. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి వచ్చేటప్పటికి టైలర్ తెచ్చిన సూట్ టీపాయ్ మీద పెట్టిఉంది.

బట్టలు వేసుకున్నాక డ్రాయింగు రూములో కెళ్ళా. అక్కడ నర్మద ఎవరితోనో మాట్లాడుతున్నది. నన్ను చూడగానే లేచి, "కాల్‌షీట్‌కి టైమయింది. సాయంత్రం కలుసుకుందాం" అంది హిందీలో. "ఓ, అలాగే" అన్నాడావ్యక్తి వెళ్ళిపోతూ. అతను వెళ్ళిన రెండునిముషాలకు టెలిఫోన్ కాల్ వచ్చింది.

నేను వెళ్ళి కారులో కూర్చున్నా.

కొంచెం సేపయ్యాక నర్మదవచ్చి కారులోకూర్చుంది. కారు పోర్టికో దాటగానే, "మీకు డ్రైవింగ్ వచ్చుకదూ?" అంది.

"ఊఁ" అన్నా. నర్మద మాట్లాడలేదు. ప్రక్కనేఉన్న వానిటీబాగ్ తీసి అందులోంచి అద్దంతీసి ఒకసారి తనముఖం అంతా చూచుకుంది. "నీవు చాలా అందంగా ఉంటావు సుమా!" అన్నా. నర్మద కళ్ళల్లో కోపం చిందులు త్రొక్కింది. ఆ కనపడిన కోపాన్ని చూచి, నేను అతి చొరవ తీసుకుంటున్నానేమో అనిపించింది. నే నెక్కడ, నర్మద ఎక్కడ. ఆకాశంలోఉండే చందమామకు క్రిందఉండే కలువకూ ఏం సంబంధం ఉంది. కలువ చందమామ కోసం ఎదురు చూస్తుంది. చందమామరాగానే ఆనందంతో హృదయం విప్పు తుంది. చందమామ వెళ్ళిపోగానే విచారంతో ముకిళించుకొని తనతల్లి ఒడిలోముడిగిపోతుంది. పిచ్చికలువ.తనలాంటికలువలు, ఎన్నోరోజూ అలా అవుతున్నాయని అర్థంచేసుకుంటుందా? ఆలోచిస్తున్నకొద్దీ నేను నర్మదను ఆరాధిస్తున్నానా అని అనుమానం కలుగుతున్నది. నర్మద నన్నుపొమ్మంటే నన్ను ఆదరించేవాళ్ళెవరు? కనీసం ప్రాక్టీసు పెడదామన్నా ఈ పశువుల డాక్టరు దగ్గరకు వచ్చేదెవరు? నా భావాలను అమ్ముకుని జీవిద్దామన్నా ఈ ఊరూ పేరూలేని కవిని ఆదరించే దెవరు? ఆ యిచ్చిన ఆదరణ నా కనీసావసరాలను తీర్చగలుగుతుందా? ఏమిటో-జీవితంలో తప్పటడుగు వేశా. ఉద్యోగానికి రాజీనామా ఎందుకివ్వాలి? ఎందుకువల్ల తొందరపడ్డాను? ఈనర్మద

ఆకర్షణకు ఎందుకు లోబడిపోయాను? ఎప్పుడో చిన్నప్పుడు కలిసి మెలిసి ఆడుకున్నాం - అంతే! చిన్నప్పుడు అన్న తమ్ము లులా తిరిగిన స్నేహితులు ఎందరు మర్చిపోలేదు? ఇలా నా ఆలోచనలు ఒకదాని వెంబడి ఒకటి ఝరీ ప్రవాహంలా సాగి పోతున్నాయి. ఒక నిట్టూర్పు విడిచి చుట్టూ చూచా. కారు రౌండు కార్నర్‌లో ఆగింది. డ్రైవర్ లేడు. నర్మద నాకేసి చూస్తున్నది.

"కారు ఎందు కాగిందీ?" అని అడిగా.

"ఇందాక అలా ప్రవర్తించినందుకు నీకు కోపం వచ్చిందా?" అని అడిగింది.

"అదేంటి నర్మదా! నాకు కోపంవస్తే గడగడలాడే వ్యక్తులు లేరని చిన్నప్పుడే గుర్తించాగా" అన్నా.

"అదికాదు. ఇందాక ఫోనులో ఒక పత్రికా ఎడిటర్ నీ గురించి అడిగాడు అని చెప్పబోతుండగా..."

"నాగురించి అడగటమేమిటి? నేనేమీ అంత గొప్ప వాణ్ని కానే?" అన్నా.

"అన్నిటికీ త్వరగా ఆలోచించకూడదు తెలుసా? నేను సినిమా తారను. నేను వేసే ప్రతి అడుగు ఈ పత్రికలవాళ్ళు చూస్తారు. మంచి చేశానా పొగుడుతారు. చెడ్డచేశానా - గోరంతలు కొండంతలు చేసి ప్రేక్షక లోకానికి తెలియచెప్పు తారు తెలుసా?" అంది.

"అసలింతకీ గొడవేమిటి?" అన్నా.

"ఏముందీ? నిన్న మీతో దిగినవ్యక్తి ఎవరు? అని అడిగారు" అంది.

"దానికేం సమాధానం చెప్పావు?" అన్నా.

"అది భవిష్యత్తు నిర్ణయిస్తుంది-అని చెప్పా. ఏం; బాగ లేదూ?"

"బాగా లేకేం? భవిష్యత్తు ఏదో జరగబోస్తుందని నమ్మడం మన కలవాటేగా!" అన్నా.

"నమ్మడం కాదు. నే తలచుకొంటే నీ భవిష్యత్తును మార్చగలను" అంది.

"నా భవిష్యత్తును మార్చడానికి చాలమంది ప్రయత్నించారు నర్మదా" అన్నా.

"లేదు. ఆ ప్రయత్నించినవాళ్ళు నీకు దోవ చూపించారేగాని ఆ దోవవెంట నడిపించలేదు. నేను నడిపిస్తా నిన్ను-నీవు ఊఁ అంటే. సరేనా?" అని అడిగింది.

"నీకు చాల ధైర్యం వుంది నర్మదా" అన్నా.

"ధైర్యం కాదు. అది గుండె నిబ్బరం" అంది.

"ధైర్యానికి మారుపేరు గుండెనిబ్బరం అంతేగా" అన్నా నేను.

"కాదు. ధైర్యం అంటే ఎన్ని కష్టాలు వచ్చినా ముందుకు నడిచిపోవడం, కాని గుండె నిబ్బరం ఉంది చూశావూ? కొన్ని కొన్ని సమయాల్లోనే ఉపయోగిస్తుంది."

"ఆ కొన్ని కొన్ని సమయాలు ఏమిటి?" అన్నా.

"చూడు! ధైర్యం ఉన్నవ్యక్తి చీకటిదారియినా సరే ముందుకు అడుగువేస్తాడు. కాని గుండె నిబ్బరం కలవ్యక్తి ఒకవంక లోపల ఆత్మశంకిస్తున్నా బిక్కుబిక్కుమంటూ బయటకు బింకంగా తడబడుతూ నడుస్తాడు. నేనూ అంతే"అంది.

"నీ నిర్వచనం బాగానే వుంది కాని, సమర్థనీయంగా లే"దన్నా.

"ఏదోలే! ఇంక అసలుసంగతికి వద్దాం. ఇందాక 'నీవు చాలా అందంగా వున్నావు నర్మదా!' అన్నప్పుడు నేను కోపంగా చూశాను. అది చూసి నీవు బాధపడ్డావు. అవునా" అని అడిగింది.

"బాధపడ్డమాట వాస్తవమేగాని నా బాధ నువ్వు అన్నావని కాదు. నా గురించే" అన్నా.

"నీ గురించి నీవు భాదపడటం దేనికి?" అంది.

"ఏముంది, అనవసరపు చొరవతీసుకుంటున్నానేమో అనిపించింది" అన్నా.

"నీవు తిట్టినా, కొట్టినా, ఏం చేసినా పరవాలేదు" అంది నర్మద వెనక్కు చేరగిలబడి.

"అంటే" అన్నా.

"నీకు నా హృదయంలో ఒకఉన్నత స్థానముంది. ఉంది కదాఅని నలుగురిలోనూ నన్ను తిట్టవద్దు. కొట్టవద్దు తెలిసిందా?" అంది నాచేయి తీసుకుని.

"సరేలే కారు ఇంతకూ ఎందుకాగినట్లు?"

"డ్రైవరును పంపేసా. నీ కెలాగూ డ్రైవింగ్ వచ్చును కదా. కాసేపు సరదాగా మాట్లాడుకోవచ్చని" అంది.

"కాలేజీలో చదివేటప్పుడు నేను సర్దాగా స్నేహితుల కార్లు డ్రైవ్ చేసేవాడ్ని మర్చిపోయి ఉండవచ్చు" అన్నా.

"ఫరవాలేదులే సినిమాతారలకు ఏక్సిడెంటులు అలవాటే. అయ్యో! 11 గంటలు అవ్వబోతున్నది పద త్వరగా" అంది.

నేను డ్రైవింగ్ సీటులో కూర్చున్నా. నర్మద నిండా ముసుగు కప్పుకొని వెనకనుంచి ముందుకొచ్చి నా ప్రక్కనే కూర్చున్నది.

కారు మౌంటు రోడ్డుగుండా పోతున్నది. "ఇక్కడ నాకో స్నేహితురాలుండాలి" అన్నా.

"పేరేమిటి?" అని అడిగింది.

"తర్వాత చెప్తాలే" అన్నా.

స్టూడియో దగ్గరకు వచ్చేసాం. కారు పార్క్ చేసి, నర్మద దిగగానే "నేను అలా తిరిగివస్తా. కారులో పెట్రోలు ఉందిగా?" అన్నా.

"ఓ.కె. డబ్బు వెనకాలఉన్న బాగ్‌లోవుంది. తిన్నగా ఒంటిగంటకు ఇంటికి వచ్చేయి. నేను ఇంకో కారులో వస్తాలే" అంది.

బాయ్ మేకప్ బాక్సు తీసుకున్నాక నేను స్టూడియో దాటా. కారు కోడంబాకం దాటాక అర్థంకాని ఆలోచనలు నిర్వచించలేని ఊహలు నన్నావరించాయి. ఒడ్డున పడ్డ చేపలా

నాలో నేను కొట్టుకుంటున్నా. కాఫీ త్రాగుదామని మౌంటు రోడ్డు దగ్గరకు వచ్చాక ఒక కాఫీ హోటలు దగ్గర కారాపి సర్వర్‌ని బయటకు పిలిచి కాఫీ తెమ్మన్నా. కాఫీ త్రాగాక టీ నగర్ వైపు వెళ్ళా. అక్కడ దారిలో ఓ తోటకనపడితే ఆ తోటదగ్గర కారాపి సిగరెట్టు వెలిగించుకుని ఆ పచ్చని చెట్ల వైపు చూస్తూ ఉండిపోయా. ఇలా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలియలేదు. చేతిని చూసుకున్నా. వాచీ పెట్టుకు రాలేదని గుర్తుకొచ్చింది. కారులో ఉన్న రేడియో స్విచ్ ఆన్ చేసా. మెడ్రాస్‌నుంచి రికార్డులు వస్తున్నాయి. టైము పన్నెండు దాటిందే అనుకుని కారును స్టార్టుచేస్తుండగా వెనక నుంచి "హలో" అని వినపడింది.

## 2

తిరిగి చూసా. ఆశాదేవి, హలో అంటూ దగ్గర కొచ్చింది. "వస్తున్నానని ఉత్తరం రాయలేదేమండీ?" అంది.

నేను కారుడోరుతీసి బయటకు వచ్చి అక్కడున్న కారునుచూచి, "మీదేనా కారు?" అన్నా.

"ఊహూ మా నాన్నగారిది" అంది నవ్వుతూ.

"సేమ్ ఓల్డ్ ఆశా" అన్నా నేను.

"అలాకాకుండా మారిపొమ్మంటారా? నన్ను" అంది.

"కాలంమారుతున్నది. మనం కూడా మారాలి" అన్నా.

"మీరు మారారుగా" అంది.

"అదిగో కోపం వచ్చిందికదూ?" అన్నా.

"నాకు కోపం వచ్చినట్లు మీకెలా తెలుసు ?" అంది ఆశ.

"నాలుగు సంవత్సరాల స్నేహంలో ఆ మాత్రం కని పెట్టలేనా" అన్నా.

"ఇలా మాట్లాడుకోవడం ఏమీ బాగాలేదు" అంది ఆశ.

"ఏం ఎవరన్నా చూస్తే కోప్పడతారా?" అన్నా.

"అది కాదు నా వుద్దేశ్యం. అకస్మాత్తుగా రెండు సంవత్సరాల తర్వాత కలుసుకున్నవాళ్లు ఇలాగేనా మాటాడు కునేది?" అని అడిగింది.

"ఏం? ఇంకెలాగ మాటాడుతారేం?" అన్నా నేను.

"మీరు రచయితలుగా! ఊహించలేరూ?" ఎదురు ప్రశ్న వేసింది.

నేను మాటాడలేదు.

"ఎక్కడ దిగారు?" అని అడిగింది.

"ఒక సినీతార యింట్లో" అన్నా.

"అదేమిటి? సినీతారలంటే మీకు అసహ్యంగా!" అని అడిగింది.

ఎందుకో ఆశనుచూడగానే నాలోని బాధంతా ఆమెకు చెప్పాలని ఉత్కంఠకలిగింది. కానీ ఆకోర్కెను అణగద్రొక్కు కొని "కారులో డ్రైవరున్నాడా?" అని అడిగా.

"ఊఁ" అంది ఆశ.

"అయితే మీ డ్రైవరును కారుతీసుకొని వెళ్ళిపొమ్మను. నా కారులో కూర్చుని వెళ్తూ మాట్లాడుకుందాం" అన్నా.

"మీరు రేపు డామాట అంటారా అని చూస్తున్నా" అంటూ గబగబ తన కారువైపు వెళ్ళింది.

ఇరవై ఏళ్ళుంటాయి ఆశాదేవికి. నేను బి. ఎస్‌సి. చదువుతున్న రోజుల్లో యూనివర్శిటీ తరఫున నాటక పోటీల్లో పాల్గొనటానికి మద్రాసుకు వెళ్ళాం. మా కాలేజీ నాటకం ఇంకా ప్రారంభంకాలేదు. "తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీవాళ్ల నాటకం ఉంది. త్వరగా తయారవండి" అని మా లెక్చరర్ గారు తొందర పడుతున్నారు. తెర ఎత్తగానే లైట్లు ఆరిపోయాయి. అది శ్మశానం సీను. యుద్ధదేవత, శాంతిదూత, ఒక మానవుడు నిలబడి వుంటారు. ఆ ముగ్గురే ఆ నాటకంలో పాత్ర ధారులు. నా మటుకు నాకు మా నాటకం ఫెయిలవుతుందని సంపూర్తిగా నమ్మకం ఉంది. ఎందుకంటే ప్రేక్షకులు హాస్యపూరితమైన నాటకాలు చూడటానికి అలవాటు పడిన రోజులవి. మా నాటకంలో హాస్యం మచ్చుకైనా లేదు. నాటకం విజయవంతం కావటం మా నటులమీదే ఆధారపడి వుంది. ఎలాగూ ఫెయిలవుతుందని నిర్జీవంగా నటించాం మా మటుకు మేం నాటకం అయిపోయింది. ప్రేక్షకుల లోంచి "ఎక్స్‌ప్రెస్ రెండ్రణా" అని కేకేశా డొవ్యక్తి. నాకు నిజంగా ఏడుపొచ్చింది. అది నేను డైరెక్టు చేసిన డ్రామా. ఇలా నేను

బాధపడుతుండగా ఒక పదహారేళ్ళ రెండు జడలమ్మాయివచ్చి "కంగ్రాచ్యులేషన్స్" అంది. నాకు చిరాకుతోపాటు కోపం వచ్చింది. "థాంక్యూ" అన్నాను గట్టిగా.

"నేను మిమ్మల్ని ఎద్దేవా చేయడం లేదు" అందా అమ్మాయి. నా మనసులోని ఆలోచనలు ఈ అమ్మాయి కెలా తెలుసా అనుకున్నా. అలా పరిచయమయింది మా ఇద్దరికీ. ఆ తరువాత నెలకో ఉత్తరంతో సాగింది మా స్నేహం. ప్రేమనావలో ఎక్కే వాళ్ళమే మేమిద్దరం ఇంకొంత కాలంపోతే. ఈలోపుగా నాన్నగారు చనిపోవడం, అందరితోనూ సంబంధాలు తెగ త్రెంపులు చేసుకోడం జరిగింది. ఆ తర్వాత మళ్ళీ కలుసుకోడం ఇప్పుడే. "ఏమిటండీ! ఆలోచిస్తున్నారూ?" అంటూ వచ్చింది ఆశా దేవి. "అబ్బే! ఏం లేదు" అంటూ కారులో కూర్చున్నా. ఆమె నా ప్రక్కనే కూర్చుంది. కారు కదిలింది. ఏదో మాట్లాడుకుందామని ఇద్దరమూ ప్రయత్నించాం. కానీ ఒక్కరమూ సఫలీకృతులం కాలేకపోయాం.

నర్మద బంగ్లాకు వచ్చాక ఆశ క్రిందకు దిగి "మొట్టమొదటసారి సినీతారతో పరిచయం" అంది.

"నాకూ అంతే!" అన్నా.

"అంటే మీ వుద్దేశ్యం?" అని అడిగింది.

"ఏముందీ? నర్మద సినీతారగా పరిచయం అయింది నిన్ననే" అన్నా.

"నర్మదంటే" అని ఆలోచించి, "చిన్నప్పటి క్లాస్ మేట్ అని వ్రాశారు ఆమేనా ఈమె?" అని అడిగింది ఆశ నాతో లోపలికి వస్తూ.

"ఊ" అన్నా.

ఇంతలో దాసీది వచ్చి, "అమ్మగారు మీకోసం ఎదురు చూస్తున్నారు మీగదిలో" అంది. ఆశను డ్రాయింగు రూములో కూర్చోపెట్టి నా గదిలోకి వెళ్ళా. గదినిండా బట్టలు న్నాయి ఆ బట్టల మధ్య కూర్చుంది నర్మద.

"ఏమిటి ఇవన్నీ? నా కోసమేనా?" అన్నా.

"లేకపోతే నేను వేసుకుంటా ననుకున్నావా సూట్లు?" అంది నర్మద.

నేనేదో అనబోయే సరికి నర్మద లేచివచ్చి నా నోరు మూసి, నీవు అనేమాటేమిటో తెలుసు" అంది నా నోటి మీదనుంచి చేతులు తీసి

"ఇందాక మౌంటు రోడ్డులో ఒక స్నేహితురాలుం దన్నానే ఆమె కనపడింది, ఇక్కడకు తీసుకువచ్చా. డ్రాయింగు రూములోఉంది పద" అన్నాను.

నర్మద మాట్లాడకుండా నన్ననుసరించింది. మమ్మల్ని చూడగానే ఆశ లేచి నమస్కరించింది. పరిచయవాక్యా లయ్యాయి.

ఒంటిగంటన్నర వరకూ సంభాషణ కొనసాగింది. ఆశ భోజనానికి ఇంటికి వెళ్ళింది.

మా భోజనాలయ్యాక నేను నా గదిలోకి వెళ్ళి నిద్ర పోయాను. రాత్రి ట్రైనులో నిద్రలేదేమో బాగా నిద్ర పోయాను. లేచి చూచే సరికి ఆశ నా ఎదురుగా కుర్చీలో కూర్చుని అక్కడేవున్న సినిమా పత్రిక చూస్తున్నది.

"సారీ చాలా లేటయ్యింది!" అన్నా లేస్తూ.

"ఆరయ్యింది" అంది ఆశ.

"మీరెంతసేపయ్యిందీ వచ్చి?" అని అడిగా అద్దం దగ్గరకు వెళుతూ.

"సరిగ్గా నాలుగున్నరకు వచ్చా. నర్మదగారు షూటింగుకు వెళ్తూ సరిగ్గా ఆరున్నరకు రాక్సీథియేటర్‌కు రమ్మనమని, మీరు లోపల నిద్రపోతున్నారని చెప్పారు. సరేలే ఎందుకు లేపడం అని అలా కూర్చున్నా" అంది కళ్ళుమిలమిలలాడిస్తూ.

"పోనీ లేపలేకపోయ్యారా" అన్నా.

"నర్మదగారు మిమ్మల్ని నిద్రలేపకుండా వెళ్ళడంవల్ల బహుశా రాత్రి మీకు నిద్రలేకపోయి ఉండొచ్చు అని ఊహించి మిమ్మల్ని నిద్రలేపలేదు" అంది ఆశ.

"మీ ఊహ కరక్టే ఒక్క అయిదు నిమిషాలలో వస్తా" అంటూ పెట్టెలోంచి షార్క్‌స్కిన్ సూటు ఒకటి తీసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళా. మొహం కడుక్కుని బట్టలు అక్కడే వేసుకునివచ్చి అద్దంలో చూస్తూ తలదువ్వుకుంటుంటే ఆశ, "నాకు ఆ కలర్ ఎంతో నచ్చింది" అంది. నేను మాట్లాడలేదు. ఇద్దరమూ బయటకు నడిచాం. ఆరూ పది అయ్యింది. బయట ఆశ కారుంది. ఆశ కారుకు పదిగజాలలో ఒక క్రొత్త ప్లిమత్ కారున్నది. ఫర్ రిజిస్ట్రేషన్ బోర్డు తగిలించి ఉంది. మమ్మల్ని చూడగానే కారును తుడుస్తున్న అతనువచ్చి, "అమ్మగారు మీకీ చీటీ ఇమ్మన్నారండీ" అన్నాడు.

చీటీ నర్మద రాసింది. కారు ఇవ్వాళ్ళ ప్రొద్దున్నే కొన్నాననని, సర్ప్రైజ్ జేద్దామని చెప్పలేదనీ, ఈ కారు మీాదే సినిమాకు రమ్మనిఉంది దాంట్లో.

"ఆశా! మనమీకారులో వెళ్దాం ఎలాగూ ప్రోగ్రాం లన్నీ అయ్యాకఇక్కడకే వస్తాంగా! అప్పుడు నీకారులో ఇంటికి వెళ్ళొచ్చు" అన్నా, "ఊ" అంది ఆశ.

క్రొత్త కారులో బయటకు వెళ్ళాం, "ఇంకా పది హేను నిముషాలు టైముంది బీచికి వెళ్దామా?"అన్నా.

"బీచికి వెళ్ళేటప్పటికే టైమవుతుందేమో?" అంది ఆశ.

"ఒక్క అయిదు నిముషాలు కూర్చుని వద్దాం" అన్నా.

"సరే మీా ఇష్టం నాకు వేరుశనగకాయలు కొనుక్కు తిందామని ఉంది"అంది. నేను నవ్వుకున్నాను. కాస్త స్పీడు హెచ్చించాను. "డాక్టర్! మీాకుకార్లగురించి ఏమీా తెలియ దనుకుంటానే" అంది ఆశ.

"తెలియదు. ఏం?" అన్నా.

"క్రొత్తకార్లు హైస్పీడులో వెళ్తే పట్టీకొడతాయి" అంది.

"తిరగబడితే చచ్చిపోతాం అంతేగా" అన్నా.

"ఊహూఁ! ఆఖరికి వైరాగ్యం కూడా ప్రబలిందన్న మాట. సరేపోనీయండి. నా కారుకూడావుంటే ఎవరు ఎక్కువ స్పీడు వెళ్ళగలరో తెలుస్తుంది" అంది.

"అలాగ స్పోర్టింగ్ స్పిరిట్ చూపించాలి" అన్నా.

బీచి దగ్గరకు వచ్చేసింది. కారు నేను ఇంకా ఆపకపోవడం చూసి "మనం ఎక్కడకు వెళుతున్నాం?" అంది ఆశ.

"ప్రశాంతంగా జనంలేని చోటుకు" అన్నా.

"అయితే నా వేరుశనగకాయలు కాళీ అన్నమాట" అంది ఆశ వెనక్కి చేరగిలబడి. జనం లేనిచోటు చూసి కారు రోడ్డు ప్రక్క ఆపా.

కారులోంచి బయటకు రాగానే చల్లనిగాలి రివ్వుమని కొట్టింది. సముద్రానికి అభిముఖంగా నడిచి ఇసుకలో కూర్చున్నా. ఎదురుగా సముద్రం అలలతో అల్లకల్లోలంగా ఉంది. నా మనసు ఏమీ చేయలేని పరిస్థితిలో ఉంది. ఏదన్నా ఆధారం దొరికితే దాన్ని పట్టుకొని వ్రేలాడదామని నా మెదడు తరచి తరచి వెతుక్కుంటున్నది. నాకు కొంచెం దూరంగా ఆశ సముద్రంకేసి చూస్తూ నిలబడింది. గాలికి ముంగురులు రెపరెప లాడుతున్నవి. ఎందుకో ఆమెలోనుంచి కనబడుతున్న యవ్వనాన్ని బయటకు వర్ణిద్దామా అనిపించింది. కాని నాలోని సభ్యత నన్నాటంక పరచింది. అలా నిశ్శబ్దంగా సముద్రంలోకి చూస్తూ కూర్చుండిపోయా. ఏం చేయాలి? ఏమిటి నా ముందు భవిష్యత్తు? అనే ప్రశ్నలు నన్ను వేధించుకు తింటున్నాయి. నా పరిస్థితికి నాకే ఏడుపొచ్చింది. ప్రశాంతంగా పల్లెటూళ్ళో పశువుల డాక్టరు ఉద్యోగమే హాయి అని పించింది. ఏడుగంటలకు హాస్పటలుకు వెళ్ళటం – పేషెంటులు వస్తే చూడటం లేకపోతే ఏదో నవల చదువుతూ సిగ

రెట్లు తగలేస్తూ కూర్చోవడమే మేలనిపించింది. కానీ ఆపనిని ఎందుకు వదలివచ్చానా? అనిపించింది. ఏనాడో ముందుకు ఆలోచించకుండా ఏపని తలపెట్టలేదు. ఈనాడు ఇలా ఎందుకు చేశాను? ఇలా తాడూ బొంగరం లేని జీవితం ఎంత కాలం గడపాలి? ఇలా పోతున్న నా ఆలోచనలకు కళ్ళెం వేసి టైము చూచా. 6-20 అయింది. ఆశ నా ప్రక్కనే కూర్చుని నన్నే చూస్తున్నది.

"ఇంక వెళ్దామా?" అన్నా లేస్తూ.

"మీ మనసుకు ప్రశాంతత లభించిందా?" అని అడిగింది.

"లేదు" అన్నా కారు తలుపు తీస్తూ.

"నాకు చెప్పకూడదా?" అంది ఆశ.

"నీకు చెప్పాలని అనిపిస్తుంది కానిచెప్పలేకపోతున్నా" అన్నా. కారు కదిలింది.

"ఏం?" అంది ఆశ.

"అసలు మెదడు బండబారి పోయింది. ఎలా పని చేయాలో కూడా మరచిపోయింది" అన్నా. ఆశ మాట్లాడలేదు.

సినిమా దగ్గరకు వచ్చేసింది. మేనేజరు దగ్గరకు వచ్చి "నర్మద గారు గదిలో కూర్చున్నారు రండి" అన్నాడు. ఇద్దరమూ లోపలికి వెళ్ళాం.

నర్మద మమ్మల్నిచూడగానే "రండి లోపలకు వెళ్దాం" అంటూ బాల్కనీలోకి దారితీసింది.

నర్మద ప్రక్కనే నేను, ఆ తర్వాత ఆశ కూర్చున్నాం.

"కారు బాగుందా?" అంది నర్మద.

"ఊఁ"అన్నాను నేను. ఎందుకో సిగరెట్ కాల్చాలని పించింది.

"పిక్చరు ఎప్పుడు మొదలుపెడతారు?" అని అడిగా.

"అసలు పిక్చరు మొదలుపెట్టేటప్పటికి ఏడవుతుంది" అంది నర్మద.

"అంతవరకూ న్యూస్‌రీల్స్, ట్రైలర్స్ ఉంటాయి కదూ?" అన్నా.

"ఊ" అంది.

"నాకు సిగరెట్టుకాల్చుకోవాలనిఉంది" అన్నా.

"పద బయటకు వెళ్దాం" అంది నర్మద.

"రండి కాఫీ త్రాగుదాం" అన్నా ఆశవైపుచూస్తూ. ఆశ తలూపి లేచింది.

వెనకాల కూర్చున్న వ్యక్తులు మాగురించి ఏదో మాట్లాడుకుంటున్నారు.

నర్మద అది గమనించి "చూశావా మనగురించి ఎలా మాట్లాడుకుంటున్నారో" అంది

"సినీతార దర్శనం అయిందని సంబరపడుతున్నారేమో!" అన్నా.

ముగ్గురమూ మేనేజర్ గదిలోకి వెళ్ళాం. మేనేజర్ మమ్మల్ని చూడగానే లేచి ఆహ్వానించాడు. కాఫీలు

త్రాగాం. నేను సిగరెట్ వెలిగించా. నర్మద, మేనేజరు, ఆశ లోకాభిరామాయణంలోకి దిగారు.

నా మనస్సు ఊరికినే ఆందోళన పడుతున్నది. ఈ ఆందోళనకు అంతూ పంతూ లేదని తెలిసికూడా మనస్సును నిగ్రహించుకో లేకపోతున్నాను. ఏదో ఒకవిధంగా బ్రతక గలను అని ఆత్మకు ధైర్యం చెప్పుకోలేక పోతున్నాను. సరిగ్గా రెండు సంవత్సరాల క్రితం నాన్నగారు చనిపోయినప్పుడు పడిన ఆవేదననే నేను ఇప్పుడు అనుభవిస్తున్నాను. నాన్నగారు గుర్తుకు రాగానే కళ్ళు చెమ్మగిల్లినాయి. హృదయంలో ఎవరో చేయిపెట్టి కెలికినట్లయ్యింది. కొడుకుగా నేను నా ధర్మాన్ని నిర్వర్తించలేక పోయాను. ఆయన బ్రతికున్నంత కాలమూ నాగురించి పడిన ఆందోళనను తొలగించలేక పోయాను. జీవితం అంటే ఒక స్థిరమైన నిర్వచనాన్ని చెప్ప డానికి నాన్నగారు ప్రయత్నించారు. భాధ్యతలను అర్థం చేసు కోమని బలవంత పెట్టారు. భాద్యత అంటే భయంవేసి తప్పిం చుకు తిరుగుతున్నానని బాధపడేవారు. అదంతా తలుచు కుంటే చివరికి మిగిలేది అంతులేని ఆవేదన, హృదయానికి అలివికాని బాధ. అంతే,

"ఇకపోదాం" అంది నర్మద నన్ను తట్టిలేపుతూ.

"పదండి" అన్నా.

ఇద్దరూ ముందు నడిచారు.

సినిమా జరుగుతున్నది. ఆశ సినిమాలో లీనమై పోయింది.

నర్మద నా చేయిమీద తనచేయి వేసి, "నీవు దేని గురించో బాధపడుతున్నావు కదూ?" అని అడిగింది మెల్లగా.

"ఏమిలేదు. రాత్రి నిద్రలేక తలకాయ నొప్పిగాఉంది. అంతే" అన్నా.

నర్మద మాట్లాడలేదు. సినిమా అయిపోయింది.

నర్మదకోసం నర్మదవచ్చినకారు ప్రక్కన జనం మూగారు. అది చూచి నర్మద మేనేజరుతో ఏదో చెప్పి వచ్చి మేం వచ్చినకార్లో కూర్చున్నది. నేను కారు స్టార్ట్ చేసా. "ఊ పోనియ్యండి" అంది. కారు సినిమాహాలు గేటు దాటాక "అమ్మయ్య" అని నిట్టూర్పు విడిచింది.

"వాళ్ళంతా మీ ఫాన్సు అనుకుంటా" అంది ఆశ.

"ఊ" అంది నర్మద.

"రేపు మీరు మాయింటికి టీకి వస్తారా?" అని అడిగింది ఆశ.

నర్మద చెప్పే సమాధానాన్ని ఊహించుకుని నర్మద మాట్లాడే లోపలే నేను, "ఎన్నిగంటలకు?" అని అడిగా. నర్మద నిరాశా పూరితమైన నిట్టూర్పు విడిచింది. అది ఆశ గమనించక, "3 గం.లకు" అంది. "ఓకె" అన్నా.

ఇంటికొచ్చాం. ఆశ తన కారులో వెళ్ళిపోయింది. "ఇంక ఆ అమ్మాయిగురించి చెప్పు" అంది నర్మద డైనింగ్ టేబిల్ వద్ద కూర్చున్నాక. నేను చెప్పాను.

"పోనీలే నీకు కంపెనీగా ఉంటుంది. కానీ రేపు నీతో రాలేను" అంది. "ఏం?" అన్నా.

"నాకు 11 గంటలకు కాల్‌షీట్ ఉంది" అంది నర్మద.

"ఎంతవరకూ?" అన్నా.

"సాయంత్రం 6 గంటల వరకూ" అంది నర్మద.

"పోనీ ఎల్లుండి వెళ్దాం" అన్నా.

"సరే నీ యిష్టం" అంది నర్మద. భోజనాలయ్యాయి. డ్రాయింగు రూంలోకి వచ్చాక నేను సోఫాలో కూర్చున్నా.

"నిద్ర రావడం లేదా?" అంది నర్మద.

"వస్తున్నది" అన్నా.

"ప్రొద్దున్నే లేస్తావా?" అని అడిగింది.

"ఎనిమిది న్నరకు" అన్నా నవ్వుతూ.

"నేనూ అప్పుడేలే. గుడ్ నైట్" అంది నర్మద నవ్వుతూ.

"గుడ్ నైట్" అన్నా నేను లేస్తూ.

గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని నిద్ర పోయా. నిద్రలోనన్నా మనసుకు శాంతి లభిస్తుందని ఆశపడ్డా. కానీ లభించలేదు.

ప్రొద్దున్నే నర్మద వచ్చి "గుడ్ మార్నింగ్" అంది.

"గుడ్ మార్నింగ్" అన్నా లేస్తూ.

"రాత్రి మర్చిపోయాను చెప్పడం. ఒక డైరెక్టరుగారు అసిస్టెంటు డైరెక్టరుగా క్రొత్త వ్యక్తిని తీసుకోవాలని అనుకుంటున్నారు. నీవెందుకు వెళ్ళకూడదు?" అంది నర్మద.

"అంటే" అన్నా.

"ఏముంది? నీకు తీరిక బోల్డంత వుంది. నిన్ను బద్దకస్తుడిగా చేయడం నా కిష్టం లేదు. ఇష్టం ఉన్నప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళి పని నేర్చుకో. అదృష్టం ఉంటే ప్రఖ్యాత డైరెక్టరు అవ్వొచ్చు" అంది.

"లేకపోతే అసిస్టెంటు డైరుక్టరుగా ఉండిపోవచ్చు. అంతేగా!" అన్నా.

"ఏం అలా అన్నావు? నీకిది యిష్టం లేదా!" అంది.

"అసిస్టెంటు డైరెక్టర్ల పాట్లు నీకు తెలియనివి కావుగా! డైలాగులు చెప్పించడం, రికార్డింగులు జరిపించడం, ఒకళ్ళకొకళ్ళు తిట్టుకొంటున్నప్పుడు వాళ్ళను సర్దడం, ఎక్స్ట్రాలకు ట్రైనింగ్ ఇవ్వడం – అబ్బ! బోరింగు కదూ!" అన్నా నేను పేస్టు, బ్రష్ తీసుకుంటూ.

"నేను నిన్ను అలా చేయించనులే" అంది. నేను మాట్లాలేదు.

"నీకిష్టంలేకపోతే వెళ్ళవద్దు. నేను బలవంతపెడుతున్నానని మాత్రం అనుకోవద్దు. ఇదొక హాబీ అనుకో" అంది.

"ఊఁ సరే" అన్నా.

"నిజంగా నీసమాధానం నాకెంత ఆనందాన్ని ఇచ్చిందనుకున్నావ్" అంటూ వెళ్ళిపోయింది నర్మద. పళ్ళు తోముకుంటూ నేనుతీసుకున్న నిర్ణయం మంచిదా కాదా? అనిఆలోచించా. చివరికో నిర్ణయానికంటూ రాలేకపోయినా ఈఅవకాశం నాకులభించడంవల్ల నాకు లాభమేనేమోనన్న అనుమానం ఆశ కలిగింది. స్నానం చేసి బట్టలు వేసుకొని కాఫీ త్రాగు

తుండగా నర్మద "ఆశను స్నేహితురాలిగానే చూస్తున్నావా? లేకపోతే..." అంటూ ఆగిపోయింది.

ఆమె అభిప్రాయాన్ని గ్రహించి, "ఇంతవరకూ నేనూ, ఆమె స్నేహితులమే. తర్వాతకథ మా వెండితెరపై చూడండి అంటుంది కాలం" అన్నా.

పకపకమని నవ్వింది నర్మద. నేను చిరునవ్వు నవ్వి ఊరుకున్నా.

"చూశావా మన గురించి ఎలా వ్రాశాడో దీంట్లో. అంటూ ఓ సినిమా పత్రిక ఇచ్చింది. దాంట్లో ఇలా వుంది. "సినీతార నర్మద ఇంతకాలం ఏకాంతంగా వుంటూవచ్చింది. ఇప్పుడామె జీవితంలో ఒక ఆత్మీయమైన వ్యక్తి ప్రవేసించాడు. అతడో వెటర్నరీ డాక్టరు. బహుశా సినీతార నర్మద కుక్కలను పెంచుతుందేమో! అతని పేరు రాజశేఖర్. మిగతా వార్తలు అందగానే ప్రచురిస్తాం" ఇది చదివి "ఏం అంత చెడ్డగా లేదే" అన్నా.

"అదీ నిజమే అనుకో, అయినా పర్సనల్ మాటర్స్‌లో తల దూర్చటం అలవాటైపోయింది వీళ్ళకి" అంది నర్మద.

"అది హాలీవుడ్‌నుంచి దిగుమతి అయింది" అన్నా.

"నిజమే, రేపు బొంబాయి వెళ్దామా?" అని అడిగింది.

"ఏం? యేమన్నా కాల్‌షీట్ వుందా?" అని అడిగా,

"అవును! నిన్న షూటింగ్‌కు వెళ్ళేముందు వచ్చాడే ఆ వ్యక్తి; అతను దీని గురించే మాట్లాడటానికి వచ్చాడు" అంది.

"ఊఁ. సరే" అన్నా.

ఇంతలో ఒక నలభైపళ్ళ ఆవిడ వచ్చింది. "మీకు ఫోన్ కాల్ వచ్చింది" అంటూ.

"ఈవిడ రాజ్యలక్ష్మి. నా పర్సనల్ సెక్రటరీ" అంది నర్మద.

"నమస్కారం" అన్నా. "నమస్కారం" అందావిడ.

"చూడు రాజ్యలక్ష్మి నేను కొన్ని కథలిస్తాను. అవి ఫెయిర్ కాపీ చేసిపెట్టు" అంది నర్మద.

ఆవిడ తలూపి వెళ్ళిపోయింది.

నర్మదతోపాటూ నేనుకూడా డ్రాయింగు రూము లోకి వస్తూ "నీవు కథలుకూడా రాస్తావా!" అన్నా. "నేను కాదోయ్ నీవు" అంది ఫోను దగ్గరకు వెళ్తూ.

చిరకాలంనుంచీ పెట్టెలో మగ్గుతున్న కథలు గుర్తు కొచ్చాయి.

ఫోనుతీసి మాట్లాడి, "నీ ఆశ పిలుస్తున్నది" అంటూ ఫోను నా కందించింది. ఆశ లోకాభిరామాయణం మాట్లా డింది. ఆ అమ్మాయితో రేపటికి వస్తామని ఇవ్వాళ రాలే నందుకు క్షమించమనీ అడిగా.

"రేపు బొంబాయి ప్రయాణం 4 గంటలకు గుర్తుం చుకో" అంది నర్మద.

ఆ సంగతీ ఆశతో చెప్పా. ఆశ ప్రోగ్రామ్ అరేంజి చేసింది.

రెండుగంటలకు టీ, మూడుగంటలకు నర్మదతో హాస్కు, నాలుగు గంటలకు తను ట్రయినుకువచ్చి నీడో్కోలు ఇస్తుంది. ఇలా ఉందా ప్రోగాం.

నేను రిసీవరు పెట్టేసా. "ఏం చేద్దాం?" అంది నర్మద. "ఏం చేయడమేమిటి?" అన్నా.

"11 గంటలవరకూ నాకుతీరుబడి. స్క్రిప్టు చదివావా?" అంది. "ఊఁ" అన్నా.

"ఎలావుంది?" అని అడిగింది.

"ఫరవాలేదు" అన్నా.

"అంటే?" అని అడిగింది.

"క్రొత్తదనం దాంట్లో ఏమీలేదు" అన్నా.

"పోనీలే మనం మార్చకుండా ఉంటే కవిగారికి భాద కలగకుండా ఉంటుంది" అంది.

ఒక పది నిముషాలు నిశ్శబ్దంగా ఉన్నాం.

ఇంతలో సెక్రటరీ వచ్చి, "బాబూరావుగారు ఇంకో పదినిముషాలలో వస్తారు" అంది.

"సరే" అంది నర్మద.

"మీ లెటర్స్ని చూస్తారా?" అని అడిగింది సెక్రటరీ.

"నేను చూడవలసినవి ఏమన్నా ఉన్నాయా?" అని అడిగింది.

"ఏమీ లేవు" అంది సెక్రెటరీ.

"అయితే అవసరమైనవాటికి జవాబులు వ్రాసేయి" అంది నర్మద.

"నీ కథలన్నీ పైకితీసి పెట్టు. మధ్యాహ్నం సెక్రెటరీ ఇంటికి తీసుకెళ్తుంది" అంది నర్మద.

"సరే" అన్నా.

"నీవుకూడా రాకూడదా?" అంది నర్మద.

"ఎక్కడికి? షూటింగుకా? రేపెలాగూ ఉందిగా బొంబాయిలో ఆ అవస్థ" అన్నా.

"పోనీలే అయితే నేవెళ్తా. నీకారుతీసుకెళ్తున్నా"అంది.

"నాకారేమిటి? తీసుకువెళ్ళడమేమిటి?" అని అడిగా.

"నిన్న కొన్నకారు నీకోసమే" అంది వెళ్ళిపోతూ.

నేనేమని ఆమెకు సమాధానం చెప్పాలో తెలియలేదు.

లేచి నాగదిలోకివెళ్ళి పాతకథలన్నీ పైకి తీశా.

అందులో పశ్చాత్తాపం అన్న కథ బయటపడగానే నా మనస్సులో తళుక్కుమని సూర్యప్రభ మెరసింది, చచ్చి ఏలోకానున్నదో. సూర్యప్రభ నేను ఇంటర్ మీడియట్ రెండవ సంవత్సరం చదువుతున్నరోజులలో నాకు జూనియరు స్టేజిమీద పరిచయం అయింది. ఆమె అంత అందంగా ఉండకపోయినా అందంగా ఉండాలని ప్రయత్నించేది. ఒక్కతాతగారు తప్ప మరింకెవరూ లేరు. ఒక్క లిప్స్టిక్ తప్ప అన్ని హంగులూ ఉండేవి. ఆ హంగులకు తోడు అతిచొరవకూడా ఉంది. ఈ అతి చొరవ ఆమెలో లేకపోయినట్లైతే ఆమె జీవితం ఎలా వుండేదో అని ఈనాడు అనిపిస్తుంది. ఆమె రమేష్‌ను పెండ్లిచేసుకున్నదని తెలిసినప్పుడు నేను చాలా బాధపడ్డాను. వాడు నాకు స్నేహితుడే కాని నా దృష్టిలో

వాడు పతితుడు. జీవితంలో ఎన్ని దుర్వ్యసనాలకు అలవాటు పడ వచ్చో అన్నిటికీ అలవాటుపడ్డాడు. వాడు మంచి అందంకల వాడు. అందానికితోడు మంచిబలము, ధైర్యములన్నీ ఉన్నాయి. నాకు ఆమె దగ్గర చొరవవున్నా ఆమె మార్గాన్ని తప్పని వేలెత్తి చూపించలేక పోయాను. నేను ఇంటర్వ్యూకు వెళ్ళి తిరిగివస్తూ సూర్యప్రభ భర్త ఆత్మహత్య చేసుకొన్నాడని చదివాను. వెంటనే ప్రభ దగ్గరకు వెళ్ళాను. వాడి కడసారి ఉత్తరంలో కుసుమ అనే అమ్మాయి పేరు వచ్చింది.

"ఎవరీ అమ్మాయి?" అని అడిగా.

"ఒక నటి" అంది.

"అసలేం జరిగింది?" అని అడిగా.

"కొంతకాలం వరకూ నే సర్వస్వమని అన్నీ మానేసి ప్రశాంతంగా జీవించారు. ఆ తర్వాత కుసుమతో పరిచయం అయింది. కుసుమ ఆయన్ను లోబరచుకొంది. ఇంతకాలం నా వల్ల ఆయనలో దాగివున్న దురలవాటులన్నీ మళ్ళీ బయట పడ్డాయి. కాని అవన్నీ నేను సహించాను. ఆయన నాదగ్గర కొస్తే చాలనిపించేది. ఆయన్నెంతో గాఢంగా ప్రేమించా. వారం రోజులక్రితం వెళ్ళినవారు రెండు రోజులవరకూ తిరిగి రాలేదు. ఆదుర్దాగా కుసుమ దగ్గరకు వెళ్ళా. నన్ను చూసి చాలా అసహ్యంగా మాట్లాడింది. నాకు కోపం వచ్చింది. "ఆయనకేం అయినా ముందు నీప్రాణాలు పోతయ్! గుర్తుంచుకో!" అన్నా. ఆయన పనిచేసే ఆఫీసు ప్యూను ఆయన ఉంటున్న గది చూపించాడు. కాని ఆయన నేను వెళ్ళేటప్ప

టికే ఆత్మహత్య చేసుకున్నారు. చుట్టూ బ్రాందీసీసాలున్నాయి. ఏంచెయ్యను? ఇది నా జీవితం" అంటూ భోరున ఏడ్చింది. నాకు జాలేసింది. ఆమెను ఎలా ఓదార్చాలో తెలియ లేదు. రెండు నెలలయ్యాక కుసుమనుచంపి, పోలీసులచేతిలో చిక్కింది సూర్యప్రభ. హత్యానేరం నిరూపించబడింది. కోర్టులో నిజం చెప్పింది సూర్యప్రభ.

ఆమెను అలా చెప్పొద్దని అంతా బ్రతిమలాడాం కాని వినలేదు. ఆఖరిరోజున రేపటితో ఆమెకూ ఈ భూలోకానికీ రుణంతీరిపోతుంది. నేను వెళ్ళగానే, "నేనూ రేపు నాలుగుగంట లకు మావారిని కలుసుకుంటా" అంది ప్రభ. "ఏమిటీ?" అని అడిగా.

"ఏముందీ? రేపు నాలుగుగంటలకు ఉరితీస్తారు" అంది నవ్వుతూ.

ఆఖరున వెళ్ళిపోతూ, "నీవు చేసిందానికి పశ్చాత్తాప పడటంలేదూ?" అని అడిగా. "లేదు" అంది.

అకస్మాత్తుగా ఆమెను కౌగలించుకోవాలనిపించింది.

మళ్ళీ జైలు అధికారుల్ని అడిగి ఆరోజే కలుసుకున్నా. చిన్నతనంలోని సంగతులన్నీ నెమరువేసుకున్నాం. కనీసం ఆమె అంతిమ ఘడియలన్నా ఆనందంగా గడిచాయి.

మిగతా సమయం అంతా హాయిగా నిద్రపోయా.

ప్రక్కనున్న టెలిఫోన్ మ్రోగింది.

రిసీవరు ఎత్తగానే నర్మద పలికింది.

సాయంత్రం అయిదున్నర నుంచి పిలుస్తున్నదట.
"ఇప్పుడు టైమెంతయ్యిందీ?" అని అడిగా.

"నీచేతికి వాచీలేదూ?" అంది నవ్వుతూ. గుర్తుకొచ్చి చూచా. ఆరుంబావు అయ్యింది.

"ఎంతయ్యింది?" అని అడిగింది.

"ఏం నీచేతికి వాచీ లేదూ?" అని అడిగా.

నవ్వి, "సరేలే ఒక్కపావుగంటలో తయారవ్వు. బీచికి పోదాం" అంది.

"నన్ను రమ్మంటావా? నీవే వస్తావా?" అని అడిగా.

"నేనే వస్తా" అంటూ రిసీవర్ పెట్టేసింది.

ఏదో నవ్యోత్సాహం నాలో కలిగింది.

సిగరెట్టు వెలిగించగానే నర్మద సెక్రటరీ వచ్చి "మీ కథలిస్తారా?" అని అడిగింది.

"అవిగో ఆ పెట్టెమీద ఉన్నాయి తీసికోండి. తర్వాత లోపలనున్న వంటమనిషితో బ్లాక్ కాఫీ తయారుచెయ్యమని చెప్పండి పది నిముషాలలో."

"అలాగే" అని కాగితాలు తీసికొని వెళ్తూండగా నేను "చూడండి" అన్నా. ఆమె వెనక్కు తిరిగి చూచింది.

"చాల థాంక్సు" అన్నా.

"డోన్ట్ మెన్షన్" అంటూ వెళ్ళిపోయింది.

అయిదు నిముషాలలో స్నానం చేసి ఇంకో అయిదు నిముషాలలో తయారయ్యా. కాఫీవచ్చింది. కాఫీ త్రాగి మళ్ళీ సిగరెట్ వెలిగించా. ఎందుకో మనస్సు సంగీతం వైపు

మొగ్గింది. డ్రాయింగు రూంలోకి వెళ్ళి రేడియో ట్యూన్ చేసి ఇంగ్లీషు సిలోన్ ట్యూన్ చేశా. ఆహ్లాదకరమయిన వాద్య సంగీతం వస్తున్నది. ఇంగ్లీషుపాట వినగానే సుబ్బారావు గుర్తుకొచ్చాడు. ఇంగ్లీషు సినిమా చూస్తూ తెరమీద ప్రేయసీ ప్రియులు ముద్దుపెట్టుకుంటున్నప్పుడు కళ్ళు చేత్తో మూసుకుని అయిపోయిందా? అయిపోయిందా? అని ప్రక్కనున్న మమ్మల్ని అడుగుతుండేవాడు. ఇప్పుడు ఎక్కడున్నాడో ఏమో. నాలుగు సంవత్సరాలు ఎంతో ఆత్మీయులుగా తిరిగాం కాలేజీలో. ఆతరువాత 'ఎవరికివారే యమునాతీరే'. తినగాతినగా గారెలు చేదు అన్నట్లు ఆ సంగీతం మీద విసుగు పుట్టింది. రేడియో కట్టేసి రేడియోగ్రామ్‌లో పుష్పవిలాపం రికార్డులు పెట్టి మళ్ళా స్విచ్ ఆన్‌చేశా. రికార్డులు వింటూ అలాగే కూర్చున్న నన్ను నర్మదవచ్చి తట్టింది. "ఇంకా మేకప్ కడుగుకోనేలేదు, నువ్వు ఒక్క నిమిషం ఆలస్యంగా వచ్చావు" అన్నా.

"ఎక్స్యూజ్ మీ" అంటూ లోపలికివెళ్ళిపోయింది.

పది నిముషాలు గడిచాయి. నర్మద వచ్చి ఎదురుగా నిలబడ్డది పంజాబీ అమ్మాయి వేషంలో. నాలోనే కనుక నా వ్యక్తిత్వం లేకపోతే నర్మదను అకస్మాత్తుగా ముద్దుపెట్టుకునే వాడినే. అంత అందంగా ఉంది నర్మద.

"ఏంటి అలా చూస్తున్నావు?" అని అడిగింది.

"నువ్వు చాలా చాలా బాగున్నావు."

"చాలా ఇది. పవర్ ఆఫ్ స్క్వేర్ అంటే పోలా" అంది నవ్వుతూ.

"ఇవ్వాళ స్టూడియో విశేషాలు చెప్పాలి" అన్నా.

"ఏమిటి విశేషం?" అని అడిగింది.

"ఈపూట ఎందుకో ఉత్సాహంగా ఉంది" అన్నా.

"కాస్త డోస్ పుచ్చుకొంటే ఎప్పుడూ ఉత్సాహం గానే ఉండొచ్చు" అంది.

"తప్పు, తప్పు. ప్రొహిబిషన్ ఉంది" అని "సరే పదపోదాం. చీకటిపడితే మళ్ళీ చలివేస్తుంది" అన్నా.

"ఛలో" అంది. ఇద్దరమూ బీచికి వెళ్ళాం.

రాయపురం బీచి దగ్గర కారాపి దారిలో హోటలులో కొన్ని టిఫిన్ అవచేస్తూ సముద్రం అలలతోపాటు నాట్యం ఆడుతున్న చంద్రుని నీడచూస్తూ కూర్చుండి పోయాం ఓ గంటవరకూ.

"నువ్వు యిక్కడకు వచ్చినందుకు బాధపడుతున్నావు కదూ?" అని అడిగింది.

"అలా ఎందుకనుకున్నావు?" అని అడిగా.

"నువ్వు వచ్చిన దగ్గరనుండి ఉత్సాహంగా లేవు. అందుకని" అంది నర్మద.

"జీవితంలో కొన్ని మనం కోరుకుంటాం. కొన్నిటిని అసహ్యించుకొంటాం. ఆఆలోచనలు ఊహాలలోనే ఉంటాయి. పరిస్థితులు తెచ్చిన మార్పుకు అలవాటు పడనంతవరకూ ఉత్సాహం ఉండదు. అంతే!" అన్నా.

"అంటే నువ్విక్కడికి రాకూడదనుకున్నావా?" అని అడిగింది నర్మద.

"అలా అనుకోడానికి, ముందు కర్తవ్యం ఆలోచించుకోడానికి నువ్వు వ్యవధి నిస్తేగా" అన్నా.

"అయితే ఇప్పుడు మళ్ళీ నీ పాత జీవితంలోకి వెళ్ళిపోవాలనుకుంటున్నావా?" అని అడిగింది నర్మద.

"ఏదీ అనుకోవడంలేదు. ఒకటిమాత్రం సత్యం. ఇక్కడకు వచ్చినందుకు బాధపడటంలేదు."

"అలాగని ఆత్మను సంతృప్తి పరచుకుంటున్నావా?" అంది.

"లేదు. పరిస్థితులు తెచ్చిన మార్పును అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నా".

"అయినా నా స్వార్థం మాత్రం నన్ను ఎత్తి పొడుస్తున్నది. అదొక్కటే బాధ" అంది నర్మద.

"ఇందులో ఎవరి స్వార్థమూలేదు" అన్నా.

"నిజమే. ఎల్లప్పుడూ వెలుతురుండదుగా" అని అంది.

"ఎల్లప్పుడూ ఆనందంగా ,ఉండాలని అంతా ప్రయత్నిస్తారు. దాంట్లో స్వార్థం ఉందనటానికి వీలులేదు. అయినా నాగురించే నీవు బాధపడటం అర్థంలేని పనిచేసినట్లవుతుంది" అన్నా.

సముద్రపు అలలు మా కాళ్ళవరకూ వచ్చినాయి. కుచ్చెళ్ళు పైకి లాగుకుని పాదాలను తాకుతున్న అలలతో ఆడుకుంటూ, "నీకు జ్ఞాపకం ఉందా? ఒకరోజు మీతోట

కెళ్ళి ఎవరికీ తెలియకుండా కృష్ణలో స్నానం చేశాం" అని అడిగింది నర్మద.

నేనులేచి ఇసకదులుపుకొని "ఉంది" అన్నా.

"ఆరోజున నీ ప్రక్కన మీ బంధువుల అమ్మాయి ఉండాలి. ఇప్పుడెక్కడుంది?" అని అడిగింది.

"బెజవాడలోనే ఉద్యోగం చేస్తున్నది" అన్నా.

"పేరేమిటి?" అని అడిగింది. "శారద" అన్నా.

"సినిమా ఛాన్సులకోసం ట్రైచేసినట్లుంది కదూ?" అని అడిగింది.

"అది సహజమేగా" అన్నా.

"నీకోమాట చెపితే ఆశ్చర్య పోతావేమో?" అంది.

"చెప్పిచూడరాదూ" అన్నా.

"ఆ అమ్మాయి ఇక్కడికి వచ్చినపుడు నన్ను కలుసుకుని నన్ను మా బావ పెండ్లి చేసుకుంటాడని చెప్పింది తెలుసా?" అంది.

"చెప్పిఉండొచ్చుకానీ నేనెవరికీ అటువంటి ఆశ కల్పించలేదు" అన్నా.

"బాగుంది. నిన్నునమ్ముకున్న అమ్మాయికదా" అని అంది.

"అయితే నిన్ను పెళ్ళిచేసుకోవాలని దేశంలో ఎంతో మంది ఆశలు పెట్టుకుంటున్నారు" అని అన్నా. "నీదంతా వితండ వాదన" అంది నర్మద.

"దీంట్లో వితండ వాదం ఏముందీ? రెండూ రెండూ నాలుగు అంటున్నప్పుడు, మూడు మూడూ ఆ రెండుకవ కూడదూ అంటున్నా" అన్నా.

"సరే నే ఓడిపోయా కానీ పోదాంపద. ఆలశ్యం అయ్యింది" అంటూ కారు కభిముఖంగా నడిచింది నర్మద.

నేను పాకెట్‌లోంచి సిగరెట్ పాకెట్ తీసి ఖాళీది నలిపి బలంగా సముద్రంలోకి విసిరేసి కారులోకూర్చొని సిగరెట్ వెలిగించా. కారుకదిలింది.

# 3

రెండు నెలలు కష్టపడి డైరెక్షన్ నేర్చుకున్నా. నర్మద ఎన్నో పుస్తకాలు తెప్పించింది. అవన్నీ చదివా. పరీక్షలలో కూడా అంత యిదిగా చదివివుండను. ఈ సమయంలో నేనూ ప్రయోజకుడ్నే అనేనమ్మిక నాలోకలిగింది. నాలోని మార్పు నకు నర్మద, ఆశ యిద్దరూ ఆశ్చర్య పడ్డారు. వారాని కొక సారి ఆశ యింటికి వెళ్తుండేవాడిని.

ఆశ నాన్నగారు వ్యాపారం చేస్తున్నారు. వాళ్ళస్థితిని బట్టి వ్యాపారంలో మంచి లాభాలున్నాయని అనుకున్నా. ఏం వ్యాపార మని నేను అడగ లేదు. ఆశకు అన్నలూ, చెల్లెళ్ళూఉన్నారు. పెద్దతనువకీలు. వివాహం అయ్యింది. అతను ఢిల్లీలో వుంటున్నాడు. రెండో అతను ఇంజనీరు. ఏదోకంపె నీలోపనిచేస్తూ యింట్లోనే కాపురం ఉంటున్నాడు. మూడో

అతను ఇంజనీరింగు చదువుతున్నాడు. నాలుగోది ఆశ. ఆశ తర్వాత లక్ష్మి. క్వీన్ మేరీస్ కాలేజీలో బి. యస్‌సి. చదువు తున్నది. అయిదో అమ్మాయి పేరు రాజేశ్వరి. యింటర్ చదువుతున్నది. వాళ్ళ కుటుంబంలో అంతా చదువుకున్న వాళ్ళే. మొట్టమొదటలో నేనంటే అంత ఆసక్తి చూపక పోయినా తర్వాత క్రమంగా నాతో కలిసి మెలిసి ఉండటం మొదలుపెట్టారు. జీవితం ఆనందంగా ఉత్సాహంగా ఉండటం మొదలుపెట్టింది. భవిష్యత్ గురించి ఆలోచనేలేదు. పది గంటలకు నేనూ నర్మదా స్టూడియోలకు వెళ్ళడం, పనులన్నీ చూశాక బీచికి వెళ్ళి నిర్మానుష్యంగా వున్న చోటుకి వెళ్ళి కూర్చునేవాళ్ళం. నర్మద రేపు షూటింగ్‌ల గురించి ఆలో చించేది. నేను నా ఊహలకు కళ్ళెం తీసి మేడలు కడ్తూఉండే వాడిని. నేను రెండు పిక్చర్లకు అసిస్టెంట్ డైరక్టరుగా పని చేసాను. నా భావాలకు ఆదరణ దొరికింది. ముఖ్యంగా నర్మద, నన్ను మెచ్చుకుంది. ఇంతవరకూ నర్మద నటిస్తున్నపిక్చరును డైరక్టు చేయలా. నాకు తెలుసు నేను చెపితే నర్మద ప్రొడ్యూ సరును ఒప్పిస్తుందని. కానీ నర్మదమీద ఆధారపడి నాకు పైకిరావడం ఇష్టంలేదు. నా స్వశక్తే నన్ను లాక్కెళ్ళాలిగాని నర్మద సిఫారసువల్ల పైకిరావడంలో నాలోని బలహీనత మళ్ళీ తలెత్తుతుందేమో అనిపించింది. ఇంతకాలమూ నేను నర్మద ఇంట్లోనేఉన్నా. నర్మద సెక్రటరీ నా కథలన్నీ పత్రి కలకి పంపింది. పత్రికలవాళ్ళు మళ్ళీ త్రిప్పిపంపకుండా వేసు

కున్నారు. కొన్ని కథలు చెత్త అనుకున్నవికూడా పడ్డాయి. నాకే ఆశ్చర్యం వేసింది. "అదృష్టంవస్తే ఒక్కసారి వస్తుంది లేకపోతే అసలు అంతా దరిద్రమే భాయి" అన్న మిత్రుడు అప్పారావు మాటలు గుర్తుకొచ్చాయి. నేను రచయితగా పాఠక లోకంలో తిష్టవేసాను. నన్ను ఇంతకాలానికి గుర్తించిందికదా అనుకున్నా. నా కథలన్నీ పుస్తక రూపంలోకి వచ్చాయి. అంకితం నర్మదకిచ్చా. దాంతో సినిమా పత్రికల వాళ్ళు క్రొత్తపుకారు లేవదీశారు. మా కిద్దరికీ ఎప్పుడో వివాహం అయ్యిందని. అందులో బొంబాయి ఫీల్డులో రహస్యంగా వివాహాలు జరుగుతున్నరోజులు. నర్మద కావార్త చూపించా. నర్మద కడుపుబ్బేటట్లు నవ్వింది. నాకూ నవ్వు వచ్చింది. నే నెందుకు వివాహం చేసుకోలేదా అని మొట్ట మొదటిసారి నన్ను నేను ప్రశ్నించుకున్నా. ఇదివరకు ఇతరులా ప్రశ్న అడిగినపుడు ఏదో కుంటిసాకులు చెప్పేవాడ్ని. నామనస్సుకా సమాధానాలు చెప్పి సంతృప్తి పరచుకోలేక పోయా. ఇంతవరకూ హృదయంలో దాగి ఉన్న నా బాధ పైకి వచ్చింది. లీలగా ప్రమీల గుర్తుకొచ్చింది. ప్రమీల నా చిన్ననాటి స్నేహితురాలు. ఏమీ తెలియని అమాయక హృదయాలు దగ్గిరయినాయి. పెద్దయ్యాక తెలిసింది దానిఅర్థం ప్రేమఅని. కాలం పరిస్థితులు కలసిరాక ఇంకొకరి సొత్తయిన ప్రమీలను మర్చిపోవాలని ప్రయత్నించా. సఫలీకృతుడ నయ్యా కొంతవరకూ. ఆమె ప్రభావం

నామీద చాలవరకు పడింది. అంతవరకూ అర్ధంలేని గంతులు వేసే నా హృదయం నిశ్శబ్దాన్ని కోరింది. నవ్వుతూ అందరినీ నవ్వించే నా ప్రవర్తన ఒక్కసారి మారిపోవడం చూసి అంతా ఆశ్చర్య పోయారు. ఇంట్లో నా ప్రవర్తన చూచి నాన్నగారు నా గురించి పదేపదే ఇతరులను అడుగుతుండేవారు. పనివాళ్లు తమలో ఏదోతప్పిదం ఉందేమోనని బాధపడేవారు. వాళ్ళకు నాగురించి చెప్పాలనుకునేవాణ్ని. కాని ఎందుకో చెప్పలేక పోయేవాడ్ని. నా జీవితంలో ప్రతి సంఘటనకు వెనక ఓ పెద్ద కథవుంది. సుఖానుభూతి వున్నవాటిని గుర్తుకు తెచ్చుకొంటుంటే వాటితోపాటు బాధ కలిగించేవి కూడా పైకి వస్తూండేవి. అందుకని కావాలని నన్ను నేను మర్చిపోడానికి ప్రయత్నించా. ఇంకా ప్రయత్నిస్తున్నా. అయినా నా పెళ్ళిగురించి ఆలోచిస్తే యుగాలు గడిచిపోవచ్చు. కాలం మారిపోవచ్చు. ఎందుకోకొందరికి ఆలోచించనవసరం లేకుండానే భాగస్వామి దొరుకుతుంది. కొందరికి ఆలోచిస్తున్నకొద్దీ కాల్యాణం వెనక్కి వెళ్ళిపోతుంది. నాపరిస్థితి కూడా అట్లాఅయితే ఒకవేళ నగ్మదనన్ను పెళ్ళిచేసుకోడానికి యిష్టపడితే ఎట్లా వుంటుందో నా పరిస్థితి? ఏమిటో నా భావాలకు సరియయిన ప్రతిరూపం ఇవ్వలేకపోతున్నా. నే పనిచేస్తున్న పిక్చర్ కంప్లీటు అయిపో వచ్చింది. దాని తర్వాత తన పిచ్చరుకు కథ, డైరెక్షను నన్ను తీసుకోమని రామమూర్తిగారు మొన్న అడిగారు. ఆయన పాపం దివాళా తీసే పరిస్థితిలో వున్నారు. ఈ రంగంలో నిలవ

ద్రొక్కుకోవాలని అహర్నిశలు శ్రమ పడుతున్నారు. ఒక వేళ నేను డైరెక్టుచేసిన పిక్చరును ప్రజలాదరించకపోతే......దీన్ని గురించి నర్మదతో మాట్లాడా లనుకున్నా. ఆరోజు రాత్రి నర్మగ 12 గంటలకు వచ్చింది. పలహారం చేసి నా గదిలో కూర్చుని లోకాభిరామాయణం మొదలుపెట్టాం. ఎందుకో నర్మద యివ్వాళ ఒక మాదిరిగా వుంది. యేమిటీ సంగతని అడుగుదామా? వద్దా? అన్న మీమాంసలో పడ్డా. ఇంతలో నర్మద అకస్మాత్తుగా లేచి, "గుడ్ నైట్" అని వెళ్ళిపోయింది. ఆమె ప్రవర్తన నాకు అర్థంకాలేదు. ఎందువల్ల ఆమె అలా ప్రవర్తించిందా నేనేమన్నా తప్పుచేశానా? అని బాధపడ్డా. నేను తెలియక చేసినా తప్పేమన్నా ఉందా అని తెల్లవారుఝామున నాలుగు గంటలవరకు ఆలోచిస్తూనే ఉన్నా. నిద్ర ఎప్పుడు పట్టిందో నాకు తెలియలేదు. లేచేటప్పటికి ఎదురుగా నర్మద కనపడింది "ప్రొద్దున్నే లేచి నిన్ను చూచా. ఇవ్వాళేమవుతుందో" అన్నా.

"చిన్నసవరణ" అంది నర్మద. "ఏమిటీ?" అన్నా.

"ఇప్పుడు టైము పదిన్నర అయ్యింది. అంటే తెల్లవారి నాలుగు గంటలయ్యిందన్నమాట" అంది. "మరి ఎందుకు లేపలేదు?" అన్నా.

"నేనుకూడా ఇప్పుడేలేచా" అంది,

"ఏం. రాత్రి సరిగా నిద్రపోలేదా?" అని అడిగా.

నర్మద సమాధానం చెప్పలేదు. నేనులేచి బాత్ రూములోకి వెళ్ళి మొహం కడుక్కునేటప్పుడు రాత్రి జరిగిన

సంఘటన గుర్తుకొచ్చింది. దాన్ని గురించి తెలుసుకోవాలని ఉత్కంఠ ఎక్కువకాగా, త్వరగా పని తెముల్చుకుని నాగదిలోకి వచ్చా. నర్మద నా ప్రక్క సర్దుతున్నది.

అదిచూచి, "అదేమిటాపని?" అని అడిగా.

"ఏముందీ స్టూడియోలో చేసేపని ఇక్కడ చేస్తున్నా. అంతేగా" అంది.

"చాలా రియలిస్టుగాఉంది సుమా" అన్నా నవ్వుతూ.

"గ్రాండ్. నీలో ఫేమస్ డైరక్టరు అవ్వాబోయే లక్షణాలున్నాయి" అంది.

"నీగాలి తగిలిందిలే" అన్నా.

కాఫీలు వచ్చాయి. కాఫీ త్రాగుతూ, "నిన్న సాయంత్రం ఏదన్నా గొడవ జరిగిందేం?" అన్నా.

"నీవేమన్నా ఆర్చేవాడివా, తీర్చేవాడవా" అంది నర్మద.

"అంత ఉద్దాత నాలో లేదుకానీ తనబాధను ఇంకొకరు పంచుకుంటే బాధ పడిన వ్యక్తికి కొంత బాధ తగ్గుతుంది" అన్నా.

"ఎందుకు లెద్దూ? నాకు కలిగిన బాధ నాలోనే ఉండి పోనియ్!" అంది.

"అలా మూసిపెట్టుకున్నందువల్ల లాభంలేదు సరికదా బోల్డు నష్టం కూడాను. తెలుసా?" అన్నా.

"నిన్న స్టూడియోలో చిన్న సంఘటన జరిగింది"అంది నర్మద.

"ఊ" అన్నా. నర్మద ఆ సంఘటన గూర్చి వివరించింది.

"నిన్న సాయంత్రం షూటింగ్‌కు వెళ్ళాను. డైరెక్టరు జరుగబోయేదాన్ని గురించి చెప్పాడు. ఆయన ఇచ్చిన స్క్రిప్టు చదువుతూ కూర్చున్నా. ఎంతసేపటికీ షూటింగ్ మొదలు పెట్టటం లేదు.

"ఏమండీ! ఇంకా ప్రారంభించరేం?" అని అడిగా.

"లేదండీ! లైటింగ్ ఎడ్జస్టమెంటు కుదరక బాధ పడుతున్నారు" అన్నాడు ఒక అసిస్టెంటు డైరెక్టరు.

"నే కాంటీన్‌లో వుంటా. నన్ను పిలవండి" అంటూ కాంటిన్‌లోకి వెళ్ళి కాఫీ త్రాగి ఏదో నవల అక్కడ వుంటే చదువుతూ కూర్చున్నా. నవల పూర్తయ్యింది. నన్నింతవరకు ఎవరూ పిలవలేదు. అసలేం జరిగిందా? అనుకుంటూ ఫ్లోర్‌లోకి వెళ్ళా. డైరెక్టరు సోఫాలో నిద్రపోతున్నాడు. కెమేరామాన్ హాలీవుడ్ మాగ్‌జైన్ చదువుకుంటున్నాడు. ఫ్లోర్ బాయ్‌లు బీడీలు కాల్చుకొంటున్నారు. అసిస్టెంటు డైరెక్టరు నన్ను చూడగానే లేచి "ఇవ్వాళ కాల్‌షీట్ కాన్సిల్ అయిందండీ!" అన్నాడు.

"ఎందుకు?" అన్నాను.

"హీరోగారికి జలుబుచేసిందంట. రాలేమని అన్నారు" అన్నాడు.

"డైరెక్టరును లేపు" అన్నాను. అతను వెళ్ళి డైరెక్టరును పిలుచుకువచ్చాడు.

"ఏమండీ! కాన్సిలయిందని నాకు చెబితే నా శ్రమ తగ్గించిన వాళ్ళవుతారుగా" అన్నా.

"అది కాదండీ! హీరోగారు వస్తారేమోనని యిందాకటినుంచి కూర్చున్నాం. ఆయన యిప్పుడే ఫోను చేశారు షూటింగుకు రాలేము అని. మీకు చెబుదామని అనుకొనే లోపలే మీరు వచ్చేశారు. అంతే" అన్నాడాయన.

"ప్రొడ్యూసరు గారు ఎక్కడున్నారు?" అని అడిగా.

"ఆయన బెంగుళూరు వెళ్ళారు" అన్నాడాయన.

నాకు అపరిమితమైన కోపం వచ్చింది. మాట్లాడకుండా పక్క ఫ్లోర్‌లోకి వెళ్ళా. స్నేహితురాలైన తార కనపడింది. "ఇంకా షూటింగ్ మొదలు పెట్టలేదే! ఫలానా ఆయనకు కాలు నొప్పి చేసిందట. అందుకని షూటింగ్ కాన్సిల్ చేసారు" అంది. "మరి నాగతేమిటి?" అన్నా. "నీకాల్‌షీట్ కూడా కాళీ అన్నమాటే" అంది. "సరిపోయింది. ఇవ్వాళంతా కాళీ అన్నమాటే. సరే పోదాం పా" అన్నా. ఆవిడకూడా నాతో వచ్చింది. రాత్రి అయింది. నిన్ను పిలుద్దామనుకున్నా. నీవుండవేమో అనుకున్నా. తిన్నగా దాస్ ప్రకాష్‌కి వెళ్ళి భోజనం చేశాం. దాస్‌ప్రకాష్‌లో నా స్నేహితురాలుకు రూముంటే ఆ రూములో పేకాడుతూ ఒక గంటగడిపి కాఫీలు తెప్పించుకొని కాఫీలు త్రాగిన తరువాత బీచికి వెళ్దామంది నా స్నేహితురాలు. చేసేపని ఏంలేదుకాబట్టి "సరే" అన్నా. ఇద్దరం నా కారులో వెళ్ళాం. అక్కడికి వెళ్లేటప్పటికి ఇందాక జలుబుచేసినట్లు చెప్పబడినవ్యక్తి ఇంకో అమ్మాయితో విలా

సంగా తిరుగుతున్నాడు. నేను ఆయనను ఆపి "ఏమండీ!మీకు జలుబుచేసిందికదా, చలిగాలిలో తిరిగితే ప్రమాదంకదూ?" అన్నా.

"నాకు జలుబుచేసిందని మీకెవరు చెప్పారూ?" అన్నాడా హీరో.

"ఇందాక కాల్‌షీట్ కాన్సిల్ చేయించారుగా" అన్నా.

"ఓ అదా! నాకు స్టూడియోకు రావాలనిపించలేదు. అందుకని ఆవంకపెట్టా. దానివల్ల మీకేమన్నా నష్టం కలిగిందా?" అని అడిగాడు.

"అబ్బే ఏంలేదు. నాకు రెస్ట్ దొరికిందిలెండి" అన్నా.

"మరిచా. ఈమె ప్రఖ్యాత సినిమాతార నర్మదగారు" అని నన్నామెకు పరిచయంచేసి "ఈమె కలవలగూడెం జమిందారిణి రాజకుమారిగారు. బహుశా మీకు తెలిసే ఉంటుంది. వీరు నేను ప్రొడ్యూస్ చేసే పిక్చరులో హీరోయిన్". అన్నాడు.

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది" అన్నా. ఆవిడముభావంగా నవ్వి ఊరుకుంది. నాలో కోపం పరవళ్ళు త్రొక్కింది. "అసలావిడ అందానికి ఆవిడ హీరోయిన్, ఆయన హీరో" అని నర్మద అంటుండగా నేను "అసలుసంగతి వదిలిపెట్టి పరదూషణకు దిగావేమిటి?" అన్నా.

"ఆ తర్వాతేమయిందంటే నేను అక్కణ్ణుంచి వచ్చేసి నా స్నేహితురాలితో తిరిగి వచ్చేసా" అంది.

"అంతేనా?" అని అడిగా.

"ఊఁ" అంది నర్మద.

"దీంట్లో నీవు బాధపడాల్సిన విషయ మేముంది?" అన్నా.

"బోల్డుంది" అంది నర్మద.

"అంటే?" అన్నా.

"నేను క్రొత్తగా ఈ రంగంలోకి వచ్చినప్పుడు ఒక రోజున టాక్సీ దొరక్క ఆటో రిక్షాలో వచ్చినప్పుడు ఈయన పెద్ద యిదిగా నీతులు బోధించాడు. తెలుసా?" అంది.

"అదీ నీ మంచికే" అన్నా.

"ఏం మంచో, గడమంచి! ఒకళ్ళని విమర్శించేటప్పుడు తమలో తప్పులు లేకుండా చూచుకోకుండా తేరగా దొరికిన వాళ్ళనంతా విమర్శించడం మొదలుపెడ్తారీ ప్రబుద్ధులు" అంది నర్మద.

"అది మానవులకుండే సహజ లక్షణం" అన్నా నేను.

"అబ్బ! ఎంత తేలిగ్గా ఆమాటను అనేశావు?" అంది నర్మద.

"ఇంతకీ ఏంచేయ దల్చుకున్నావ్?" అన్నా నేను.

"ఏముంది? రేపు కాల్‌షీటుంది. ఎగ్గొట్టేసి గైర్‌హాజర్ అవుతా" అంది.

"భాగుంది. మధ్యన చెడేది ప్రొడ్యూసరేగా" అన్నా

"నీ కింకా అనుభవం చాలదు" అంది నర్మద.

ఇంతలో రాజ్యలక్ష్మి గారు వచ్చి, "ఆశాదేవి వచ్చిందండీ" అని చెప్పింది.

"లోపలికి పంపించు" అంది నర్మద. ఆశ లోపలికి వస్తూ మాకిద్దరికీ నమస్కరించింది.

"అవునుకాని, ఆశాదేవీ! పరాయివ్యక్తిలాగ 'లోపలికి రావచ్చా' అని అనుజ్ఞకోసం ఎదురుచూడటం ఎందుకు?" అని అడిగింది నర్మద.

"సొసైటీ మేనర్స్ అవునా ఆశాదేవి?" అన్నా నేను. ఆశ నవ్వింది.

"అయ్యర్! కాఫీ కొండువా" అని కేకేసింది నర్మద.

కాఫీలు అయ్యాక నేను సిగరెట్ వెలిగించా.

"నీవు సిగరెట్లు ఎక్కువ కాలుస్తున్నావు కదూ?" అని అడిగింది నర్మద.

"ఏం? వాదించటానికి ఏ టాపిక్ దొరకలా? నా సిగరెట్లమీద పడ్డావు?" అన్నా నవ్వుతూ.

"మీకు అది అలవాటు కాదుగా?" అని అంది ఆశ.

"అలవాటు కాకపోవడమేమిటి? రోజుకో టిన్ను కాల్చి పారేస్తుంటే!" అంది నర్మద.

"మీరు మానేయాలంటే మానేయలేరూ?" అంది ఆశ.

"ఓ మానేస్తా. కానీ దానివల్ల నాకేమీ ఉపయోగం కనపడలా" అన్నా నేను.

"మానేయండే దానివల్ల ఉపయోగం ఎలా నిర్ణయిస్తావూ?" అని అడిగింది నర్మద.

"ఎప్పుడన్నా నే నొక మాటన్నానంటే అనుభవం మీాదే అంటా" అన్నా నేను.

"ఒహో! పెద్ద అనుభవజ్ఞుడవు" అంది నర్మద.

"మీారిలా ఎప్పుడూ చిన్నపిల్లల్లాగా దెబ్బలాడుకుంటా రెందుకు?" అంది ఆశ.

"ఇంక నీకు ఫర్వాలేనులేవయ్యా! నిన్ను సమర్థించే వ్యక్తి దొరికింది?" అంది నర్మద.

"అలా అన్నంత మాత్రాన నన్ను సమర్థిస్తోందని ఎందు కనుకున్నావు?" అన్నా నేను.

"టాపిక్ మార్చేద్దాం. అది అందరికీ ఆరోగ్యకరం" అంది నర్మద.

"వెరీ గుడ్" అన్నా నేను.

""మీారు ఏదో పిక్చరును డైరెక్టు చేస్తున్నారటగా" అని అడిగింది ఆశాదేవి.

"అని మీాకు ఎవరు చెప్పారూ?" అన్నా నేను.

"ఒక సినిమా పత్రికలో వుంది" అంది ఆశ.

"నేను చూడలేదే!" అన్నా.

"తీసుకువస్తా నుండండి" అంటూ బయటకు వెళ్ళి తన కారులో ఉన్న పత్రికను తీసుకువచ్చింది.

"నేను చదువుతాను. ఇలా ఇవ్వండి" అన్నా.

"వద్దులెండి. నేనే పైకిచదువుతాను" అంటూ చదువ నారంభించింది.

"తాజావార్త! ఇంతవరకూ అసిస్టెంటు డైరెక్టరుగా ఉండి, నర్మదగారి స్నేహితులయిన శ్రీ రాజశేఖర్ గారు, రామమూర్తిగారు తీయబోయే చిత్రానికి కథ వ్రాస్తారని, డైరెక్షను కూడా వారే చేస్తారని తెలుస్తున్నది. సందర్భం వచ్చింది కనుక తెలియపరుస్తున్నాం. శ్రీ రావు గారికి, సినీ తార నర్మదకుగల సంబంధం ఏమిటని? అసంఖ్యాక పాఠక లోకం మాకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. కొందరు వారిరువురూ భార్యాభర్తలా?అని అడుగుతున్నారు. మాకు, విలేఖరికి తెల్సినంతవరకూ తెల్పుతున్నాం. నర్మదకు శ్రీ రావుగారికి స్నేహం స్నేహంగా లేదు. నిజంగా వారిరువురి ప్రవర్తనచూస్తే భార్యా భర్తలలాగే ఉన్నారు" అంటూ ఆగిపోయింది. నర్మద తలదించేసుకుంది.

ఆశ మాట్లాడకుండా ఆ పత్రిక క్రిందపడేసి టేబిల్ మీద పడివున్న ఒక నవల పుటలు తిరగ వేస్తున్నది. అంతా నిశ్శబ్దం. గడియారం టిక్కు, టిక్కు శబ్దం భయంకరంగా వినబడుతున్నది. నాకేం చేయాలో తోచటంలేదు. భయంకరమైన నిశ్శబ్దం మా ముగ్గిరిమధ్యా తాండవిస్తుంది. ఎవరు ముందు మాట్లాడాలా అన్న మీమాంస పడుతున్నాం ముగ్గురమూ. గడియారం అరగంట కొట్టింది. నేను లేచి రేడియోగ్రాంలో లతామంగేష్కర్ రికార్డ్ పెట్టి "అయ్యర్ కాఫీ తీసుకురా" అని కేకేసి మళ్ళీ సోఫాలో కూర్చున్నా.

అయ్యర్ కాఫీలు తీసుకు వచ్చాడు.

నేను సిగరెట్ వెలిగిస్తూ, "ఇటువంటి చిన్నవాట్లకు బాధ పడటం చాలా బుద్ధి తక్కువ. మనల్ని మనం న్యూనత పరచుకుంటున్నామన్నమాట" అన్నా.

"నన్ను క్షమించమని అడగడానికికూడా అర్హత కోల్పోయాను" అంది ఆశ.

"ఇందులో మిమ్మల్ని క్షమింపవలసిందేమీ లేదు. మీరలా బాధపడటం అనవసరం" అన్నా.

"టాపిక్ మార్చేయ్ బాబూ" అంది నర్మద.

"ఇవాళ సాయంత్రం హాయిగా ఎక్కడికన్నా వెళ్దాం" అన్నా.

"మాయింటికి రండి. ఇవ్వాళ మా అక్కయ్య కొడుకు పుట్టినరోజు" అంది ఆశ.

"ఓ. ఆల్ రైట్" అంది నర్మద.

ఇంతలో టెలిఫోన్ మ్రోగింది.

నర్మద కాల్ అందుకుంది. "నిన్నే పిలుస్తున్నారు." అంది.

నేనులేచి ఫోన్ అందుకున్నా.

రామమూర్తిగారు పిలచారు. ఆయన చెప్పిన సంగతి గురించి ఏం చేసావని అడిగారు.

"కథ ఎవరికన్నా ఇవ్వండి డైరెక్షన్ తీసుకుంటా" అన్నా.

"అయితే ఇప్పుడేవస్తా" అని ఫోన్ పెట్టేసారు.

“ఏమిటది?” అని అడిగింది నర్మద.

“ఆయన పిక్చరుకు కథ డైరక్షన్ తీసుకోమంటున్నారు” అన్నా.

“కంగ్రాచ్యులేషన్స్” అంది నర్మద.

“చాలా ఆనందంగా ఉందామాట విన్నతర్వాత” అంది ఆశ.

“నేను సాయంత్రం నాలుగు గంటలకు వస్తా” అంది ఆశ లేస్తూ.

“నేను వస్తున్నానని ఎవ్వరికీ చెప్పకండీ” అంది నర్మద.

“చెప్పను” అంటూ వెళ్ళిపోయింది.

“ప్రొద్దున రామమూర్తిగారి గురించి నీతో ఆలోచిద్దామనుకున్నా” అన్నా.

“నాతో దేనికి?” అని అడిగింది.

“నా అభివృద్ధికి కారకురాలవు నివేగా” అన్నా.

“అది కృతజ్ఞతా? లేక పొగడ్తా?” అని అడిగింది నర్మద.

“రెండూనూ” అన్నా.

“మరీ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు పడమాకు” అంది నర్మద.

“మరిచా రామమూర్తిగారు వస్తారు. నీవే మాట్లాడెయ్” అన్నా.

“ఏం నీవెందుకు మాట్లాడకూడదు?” అని అడిగింది.

"నాకీ పరిశ్రమలో అనుభవం తక్కువ. ఎలా మాట్లాడాలో నాకు తెలియదు" అన్నా లేస్తూ.

"సరేలే త్వరగా వచ్చెయ్" అంది.

నేను రాజ్యలక్ష్మిగారితో కారులో బయలుదేరా. నా ప్రక్కనే ఆవిడ కూర్చుంది.

"మీ స్వగ్రామము ఏదండీ?" అని అడిగా.

"రాజమండ్రి" అందావిడ.

"ఎట్లాచేరారీఊరు?" అన్నా.

ఆవిడ బి. ఏ. ప్యాసయిందట. తండ్రి చనిపోగానే ఆ సంసార పోషణా భారము ఆమె మీద పడితే ఎక్కౌంటెన్సీ, టైపు, షార్ట్‌హాండ్ నేర్చుకుని ఉద్యోగంలో చేరిన తర్వాత ఒక సారి నర్మద రైల్లో కనపడి తన సెక్రటరీగా ఉండిపొమ్మందట. ఆవిడ కథ వినగానే నాకు నవ్వొచ్చింది నర్మద ప్రవర్తనకు. అసలీ ఆడవాళ్ళే అంత. రైల్లో కలిసిన పరిచయాలు గాఢంగా హత్తుకుపోతాయి. కానీ మొగవాళ్ళకు అలాకాదు. డాంబికత్వం, హోదా వాళ్ళని దగ్గరకు చేరనీయవు. ఇలా ఆలోచిస్తుండగా "కారాపండి. ఇదే మాయిల్లు" అంది. ఆవిడను దింపి బజారుకు వెళ్ళి బొమ్మలు, ముక్కు చెంబు కొని ఇంటికి వచ్చా. అదే సమయానికి రామమూర్తి గారు సరిగ్గా వెళ్ళిపోబోతున్నారు. నన్ను చూడగానే విష్ చేసి "ఇంతవరకు సగం పూర్తయ్యాయి వ్యవహారాలన్నీ. కథ అయిపోగానే సెట్స్‌మీదకు వెళ్ళిపోదాం. ఈలోపుగా రాఫిలుంలకు ప్రయత్నిస్తా" అన్నారు.

"మరి నటుల సంగతో?" అన్నా.

"ఇంకెవరు? నర్మదగారు హీరోయిన్, ఆతర్వాత కథ లోని పాత్రలను బట్టి నటులను నిర్ణయిద్దాం" అన్నా రాయన లోపలకి వస్తూ.

"సరే కూర్చోండి. కాఫీ త్రాగి వెళ్లుదురుగాని" అన్నా.

"ప్రొద్దున లేచింది మొదలు సరిగ్గా ఓ ఇరవై సార్లయి నాయి. సారీ! ఏమనుకోవద్దు. వస్తా" అంటూ వెళ్ళిపోయారు.

సోఫాలో కూర్చున్నా. ఆలోచనలు నన్నావహిస్తు న్నాయి. అసలా కంట్రాక్టుకు ఒప్పుకోవడవల్ల నన్ను నేను నాశనం చేసుకుంటున్నానేమో? అసలు ఒకప్పుడు ఉద్యోగా నికి రాజీనామా యిచ్చి ఇక్కడికి రావడం చాల పొరపా టుగా కన్పిస్తుంటుంది. సినిమా రంగంలో జీవితం చాలా విచి త్రంగా ఉంటుంది. ఈ రోజు వదిలి రేపటి గురించి ఆలోచిం చడం శుద్ధ తెలివితక్కువతనం ఈరోజు గగన సీమలో ఉన్న తెర తార, రేపటిరోజున రాలిపోతుంది. తారను గొప్పగా ఘనంగా పొగుడుతున్న ప్రజలు ఒక్కరోజులో మర్చిపోతారు. నిజంగా వేదాంతాలు చెప్పినట్లు జీవితాలు క్షణ భంగురాలు అన్న వాక్యం సినిమా రంగంలోవుండే వ్యక్తుల జీవితాలకు సరిగ్గా అతుకుతుంది. ఈరోజు నేను పెద్ద డైరక్టరు అవ్వొచ్చు రేపటిరోజున కర్మకాలి పిక్చరు ఫెయిలవ్వొచ్చు. ఆరోజున నాగతి ఏమవుతుంది? జీవిత పోరాటంలో ఓడిపోయిన నాకు ఆసరాగా ఉంటుందా నర్మద? అసలీ సినిమా డైరెక్షన్ నా కివ్వటంలో ఎవరి ప్రోత్సాహముంది? నర్మద ఆలోచనేనేమో

అనిపించింది. ఎందుకో ఆశించని ఉత్సాహం నాలో పొంగి పొరలింది. ఉత్సాహంగా సిగరెట్ వెలిగించా.

"కంగ్రాచ్యులేషన్స్" అంటూ నర్మద వచ్చింది.

"దిసేమ్ టు యూ" అన్నా.

గడియారం అరగంట కొట్టింది. పన్నెండున్నర అయ్యింది.

"కంట్రాక్టు కాగితాలు బీరువాలో ఉన్నాయి చూసుకో" అంది నర్మద నా ప్రక్కనే కూర్చుని.

"నేనుచూడను" అన్నా. "ఏం!" అంది.

"నీమీద నాకు నమ్మకం ఉంది" అన్నా.

"కుక్కతోకా పుచ్చుకొని గోదావరీదితే కోటిపల్లి కాడ తేలేరయ్యా" అంది రాగయుక్తంగా నర్మద.

"ఫికర్ నై" అన్నా?

# 4

పిక్చరు సగం అయిపోయింది. ఇది ప్రారంభించాక అన్ని కంట్రాక్టులు అసిస్టెంట్ డైరక్టరుగా ఒదులుకున్నాను. పిక్చరుకు అనుకున్న డబ్బుకంటే తక్కువ అయ్యేటట్లుంది. అందర్నీ అసిస్టెంట్‌లను తీసుకున్నా. ఉత్సాహంగా పనిచేస్తున్నారు. నా మనస్సుకు విరుద్ధంగా రామమూర్తిగారి మాట మీద ఈరోజుల్లో ప్రజల అభీష్టాలకు కావల్సినవన్నీ ఉన్నాయి. చిత్రం ప్రారంభించాక మనస్సుకు విశ్రాంతిలేదు.

ఒక్క ఆ గొడవతప్పితే మరింకదేన్ని గురించీ ఆలో...
లేదు. పాటలన్నీ రికార్డింగ్ అయిపోయాయి. ఆ రోజున
నర్మద సెట్ మీద ఉంది. సినిమాలో సుజాత బి. ఏ.
చదువుతున్నది. "కాలేజీ డే" ఉత్సవాలు జరుగుతున్నవి. ఆ
గేయం యిట్లాఉంటుంది—

"నల్లని కనుల ప్రేయసీ
నను సూసి సైగ సేసే
నల్లని రేతిరిలో
నా యెదలో మెదిలేటి
నల్లని కనుల ప్రేయసీ
నను సూసి సైగ సేసే
నల్ల నీ కనుపాపలే నమృతమయమెలే
నల్లేరు పాయలో, నాసేతిలో సేయ్యేసి
నాయెదలో మెదిలేటి నల్లనీ కనులప్రేయసీ
ననుసూసి సైగ సేసే
నల్లంచు కోక కట్టి, నల్లనీ రైకేసి
నడ్డిమీద సేయ్యేసి, నాయెదలో మెదిలేటి
నల్లని కనుల ప్రేయసీ
నను సూసి సైగ సేసే......"

ఈగేయం నేపధ్యంలో పాడుతుండగా సుజాత నాట్యం
చేస్తుంటుంది. ఈ పాట్ తర్వాత ఇంకో పాట్ ఉంటుంది.
దాంట్లో సుజాత నటిస్తున్న పల్లెపడుచుభావ పాలంలో ఏతాం

తొక్కుతూ ఈపాట పాడుతుంటాడు. ఆపాట్ సుజాతనాట్య దృశ్యాలు కలిపి ప్రాసెస్ చేశాం. మధ్యనాలంచ్ టైంవచ్చింది. మేకప్‌తోనే నటులు, టెక్నీషియన్‌లు భోజనాలుచేస్తున్నారు. రామమూర్తిగారు కూడా మాతోనే కూర్చున్నారు. నర్మద "రోజూకనుక ఇలా తిన్నామంటే త్వరలోనే ఈ రంగంనుంచి విశ్రాంతి తీసుకోవచ్చు" అంది.

"అదేమిటండీ అలా అంటారు?" అని అడిగారు రామమూర్తిగారు.

"నే చెబుతున్నా వినండి. చిన్న రోడ్ రోలర్ లాగా తయారవుతానేమోనని భయంగా వున్నట్లుంది నర్మదగారికి. ఏమిండీ?" అన్నా నేను.

అంతా నవ్వారు.

నర్మద "సైలెన్స్" అంది.

"ఎస్ యువరానర్!" అన్నాడొక టెక్నీషియన్. సర్దాగా కాలం గడచిపోయింది. ఆ రోజు మరుచటి రోజు కాల్‌షీట్ లేదు. ఇంటివద్దనే ఉన్నా. నర్మద స్టూడియోకి వెళ్ళిపోయింది. ఆశాదేవి వచ్చింది.

"రండి, రండి. చిరకాల దర్శనం" అన్నా.

"మీ దగ్గరకు రావడానికి భయంవేస్తున్నదండీ" అంది.

"అదేం?" అన్నా.

"ఏముందీ? మీరు మునుపటి వ్యక్తికారుగా" అంది.

"ఏం? ఎక్స్‌ట్రాగా నాలుగు చెవులు, నాలుగు కాళ్ళు మొలవలేదే భయం దేనికి?" అన్నా.

"మీరు పెద్ద డైరెక్టరుగారు కదా?"

"ఊఁ. అయితే అందుకని భయం అన్నమాట. చూడండి ఆశాదేవి! మీరు మరీ చిన్నపిల్లలయి పోతున్నారు. నడమంతరపు సిరి ఇది. దానికోసం స్నేహితుల్ని వదులుకుంటానా?" అన్నా.

"కోపం వచ్చినట్లుంది. నేనూరికినే అన్నా" అంది.

"అరే! నిల్చునే ఉన్నారే? కూర్చోండి" అన్నా. ఆశ కూర్చుంది.

"ఊరికినే కూర్చుంటే లాభంలేదు. కబుర్లు చెప్పాల్సిందే" అన్నా.

"నర్మద గారేరి?" అని అడిగింది.

"నాకంటే తీరిక బోల్డంత ఉంది. ఆవిడ స్టూడియోల చుట్టూ తిరగద్దూ?" అన్నా.

"ఇవ్వాళెంత తారీఖు?" అని అడిగింది.

"మూడు" అన్నా.

"ఏ నెల?" అని అడిగింది.

"ఆగష్టు" అన్నా.

"ఎల్లుండి" అని అడిగింది. "అయిదు" అన్నా.

"ఆరోజు నా పుట్టినరోజు" అంది. "పార్టీకేగా తప్పకుండా వస్తా" అన్నా.

"పిక్చరు కంప్లీట్ అయిందా?" అని అడిగింది.

"లేదు. ఇంకా ఒకవంతున్నది." అన్నా.

"చాలా త్వరగా ముగిస్తున్నారు. రషెస్ వేసుకున్నారా?" అంది.

"రమేష్ చూడాలంటే భయంగాఉంది. ఆ చివరిరోజు వరకూ ఎదురు చూడాల్సిందే" అన్నా.

"మర్చిపోయా ఏదన్నా పనిమీద వచ్చారా?" అన్నా.

"ఏం పనిమీద తప్పితే ఇక్కడకు రాకూడదా?" అని అడిగింది.

"బాబోయ్. మీతో మాట్లాడాలంటేనే భయంగా ఉంది" అన్నా నవ్వుతూ.

కాఫీలు వచ్చాయి. కాఫీలు త్రాగాక నేను సిగరెట్ వెలిగించి రికార్డులు పెట్టుకుని కూర్చున్నా. ఎందుకో ఈ పాటలూ, సంగీతం ఎన్నిసార్లువిన్నా విసుగుపుట్టదు చదువు కుంటున్నప్పుడు. పరీక్షలలో రేడియో దగ్గిర కూర్చుని పాఠ్య గ్రంథాలు చదివేవాడిని. బుర్రలోకి ఎంత ఎక్కేదో, ఎంత ఆవిరి అయిపోయేదో తెలిసేదికాదు.

ఆశ అట్లానే కూర్చుని నాకేసి చూస్తున్నది.

"ఏమిటట్లా చూస్తున్నారూ?" అని అడిగా.

"మీలో చాలా మార్పు వచ్చింది" అంది.

"మానసికంగా మాత్రమే" అన్నా.

"అవును. మీరిదివరకులాగా ఫ్రీగా మాట్లాడటంలేదు. ఆ మార్పు మీరు తెచ్చిపెట్టుకున్నట్లుంది" అంది.

"లేదండీ! నేను తెచ్చిపెట్టుకున్నదికాదు. పరిస్థితులు తెచ్చిపెట్టిన మార్పది. నిజంగా నాకే ఆశ్చర్యం వేస్తున్నది. ఇంతవరకూ నేగడిపిన జీవితంలో ఒక్కసారికూడా ఒక్క సంఘటనమీద, ఒకే సమస్యమీద ఇంతకాలం ఆలోచించ

లేదు. ఏమిటో ఎలా మారానో నాకే అర్థం గావటంలేదు" అన్నా నేను.

ఆశ మాట్లాడలేదు. కొంతసేపటివరకూ నేనూ మాట్లాడలేదు.

రేడియో గ్రామ్‌లో రికార్డులయిపోయాయి. మళ్ళీ కొత్తవిపెట్టా. పైనున్న చేపలతొట్టిలో కొంచెం మేతవేసే టప్పటికి నిశ్చింతగా, హాయిగా, విలాసంగా తిరుగుతున్న చేపలు ఒక్కసారి నా వ్రేలిచుట్టూ గుమిగూడాయి. నిజంగా ఒకవిధంగా మాకూ చేపలకూ ఏమీ తేడాలేదు. సినిమా రంగంలో అడుగుపెట్టకముందు ఎక్కడో ఉంటూ ఎవరిపొట్ట వారు నిశ్చింతగా పోషించుకుంటూ గడుపుతుండేవారు. ఒక్కసారి మద్రాసు చుట్టూచేరి సినిమా ముఠా అని ముద్రవేసుకుని సమస్తమూ ఒడ్డి బ్రతకడానికి పోరాడతారు. దివాళా అంటే ఓడిపోయారా వాళ్ళ పరిస్థితి అధ్వాన్నం అయిపోతుంది. కనీసం మునుపటి జీవితం జీవించలేరు. నీటి బయటి చాపలాగా కొట్టుకుంటూ మాసిపోతారు. ఇటువంటి జీవితాన్ని చేపట్టే టప్పుడు ఇవన్నీ నేను ఆలోచించలేదు. నేనాలోచించింది ఇంకో దృక్పథములో. జరుగుతున్న జీవితం నేను ఊహించనిది, ఆశించనిదిపరిస్థితులకు బానిసకాకూడదు అనుకుంటూనే ఐపోయా. చిత్రం మానవ జీవితం. ఏదో ఎవర్నో జయిస్తున్నామూ, జయించామూ అని సంబర పడుతూ ఉప్పొంగిపోతాడు కానీ తనకుతానే ఓడిపోయాననే బహిర్గత శక్తులకు పరిస్థితులకు బానిసనయ్యానని గుర్తించలేడు. గుర్తించే సమయానికి ఎవర్నీ జయించలేని బలహీనుడవుతాడు. ఎదురుగా ఆశ, కోరికలనే

రెండూ గనుగ లేకపోతే జీవితంలో ఆనందాన్ని అనుభవించ లేను. అనుభవించని ఆనందం కనుక జీవితంలో ఉంటే ఆ వ్యక్తి వ్యర్థజీవి అవుతాడు. ఎందుకూ ఈ జీవితం అనుకున్న వ్యక్తులు ఉన్నారా? అని నాకు అనుమానం అప్పుడప్పుడూ కలుగుతుంటుంది.

"హోల్డాన్" అని కొంచెం గట్టిగానే అంది ఆశ.

నా ఆలోచనలోంచి ఒక్కసారి మేల్కున్నా. ఆశ చిరునవ్వు నవ్వుతుంది.

నేనూ నవ్వేశా.

"ఏమిటి ఆలోచిస్తున్నారూ?" అని అంది.

"ఏముందీ నిల్" అన్నా.

"లేదు ఏదో ఆలోచిస్తున్నారు" అంది.

ఇంతలో టెలిఫోన్ కాల్ వచ్చింది. రిసీవర్ ఎత్తా. నర్మద స్టూడియోనుంచి పిలుస్తున్నది.

"ఎందుకూ?" అని అడిగా.

"రావయ్యా. ఇక్కడ మీ ఆర్ట్ డైరెక్టరూ, డ్యాన్సు డైరెక్టరు, కవిగారు, రామమూర్తిగారూ దెబ్బలాడుకొంటు న్నారు" అంది నర్మద.

"దేన్ని గురించీ" అన్నా.

"దేవాలయం సెట్టు గురించి" అంది.

"అయితే వస్తున్నా" అంటూ రిసీవరు పెట్టేసి ఆశతో "పదండి. అలా స్టూడియోకి వెళ్దాం" అన్నా.

"సరే! పదండి. నాకూ ఖాళీయే" అంది.

కారును బయటకు తీసి ఆశ కారును గ్యారేజిలో పెట్టి ఇద్దరమూ బయలుదేరాం.

"ఏమండీ! నాకు తల నొప్పిగా వుంది. ఎక్కడన్నా కాఫీ త్రాగుదాం" అంది ఆశ.

"ఓ. కే." అంటూ మౌంట్ రోడ్డులో రాంగు కార్నర్‌లో కారాపి ఒక హోటలులోకివెళ్ళి కాఫీత్రాగి మళ్ళీ బయలుదేరాం.

స్టూడియో దగ్గరే ఆర్ట్సు డైరెక్టరు మురళి ఎదురు పడ్డాడు. అతనిని కూడా కారులో ఎక్కించుకొని లోపలికి వెళ్తూ "ఏమిటి సంగతి?" అని అడిగా.

"బాబూ! నన్నేమీ అడక్కండి. ఎలానూ వచ్చారుగా. మీరే వింటురుగాని" అన్నాడు మురళి. కారాపి లోపలికి వెళ్ళి మా సెట్ ఉన్న ఫ్లోర్‌లోకి వెళ్ళాం.

అక్కడ రామమూర్తిగారు, నృత్య దర్శకులు మూర్తి గారు ఉన్నారు. నర్మద లేదక్కడ. "ఏమిటి సంగతి?" అని అడిగా కూర్చోగానే.

"రేపు దేవాలయం సెట్‌మీద షూటింగ్ ఉందికదా. కంప్లీట్ సెట్ స్కెచ్ వేసి, ఖరీదుకట్టి నేను రామమూర్తి గారికిచ్చా. ఆయన సెట్ అంతా బాగానే ఉంది. క్రిందఫ్లోర్ మాత్రం బాగాలేదు అన్నారు" అన్నాడు మురళి.

"అది కాదండీ! నేలమీద గళ్ళడిజైన్ వేసి గడివిడిచి గడి నలుపురంగువేస్తే బాగుండదూ? ఫిల్ములో కొట్టొచ్చి నట్లు కనబడుతుంది గదూ?" అన్నారాయన.

"చూడండీ! ముఖ్యంగా దేవాలయం గురించి సెట్ వేసుకొనేటప్పుడు కొన్ని ఆలోచించాలి. దేశం, అచ్చటి ప్రజల అచారాలు, ఆనాటి కాలం, ఆ రోజులలో ప్రబలంగా ఉన్న పరిస్థితులు చూచుకోవాలి. వాటి కనుగుణంగానే దేవాలయములోని శిల్పం ఉంటుంది. సామాన్యంగా దేవాలయాలు పురాతన పద్ధతులలోనే ఉంటాయి. అంతేగాని ఆధునాతన చర్చిలో ఫ్లోరు ఉన్నట్లు మన దేవాలయాలలో ఉండమంటే ఎట్లా వుంటుంది?" అన్నాడు మురళి.

"ఏమండీ! మీరేమంటారు?" అని అడిగారు రామమూర్తిగారు నన్ను.

"చక్కగా మిడిల్‌లో మురళిస్కెచ్ ఇచ్చినట్లు పద్మం చుట్టూ నలు పలకల బార్డరు బాగా ఉంటుంది" అన్నా నేను.

"అయితే నర్మదగారేరీ?" అంటూ లేచారాయన.

"ఆవిడ మేకప్ రూంలో ఉంటుంది" అన్నాడుమురళి.

"పిలుచుకురా భాయీ!" అన్నారు మూర్తిగారు.

"మీ ప్రక్క నున్నవారిని పరిచయం చేయనేలేదు?" అన్నారు రామమూర్తిగారు.

"ఓ సారీ! ఈవిడ ఆశాదేవి బి. యస్‌సి. నా ఆప్తుల్లో ఈమె ఒకరు" అన్నా.

ఆశ నమస్కారం చేసింది.

"మీరు క్వీన్ మేరిస్‌లో చదివారుకదూ?" అన్నారాయన.

"అవునండీ" అంది ఆశ.

"అయితే పోయిన సంవత్సరం మీకు భరత నాట్యంలో ప్రయిజువచ్చింది కదూ" అని అడిగారాయన.

"అవును" అంది ఆశ.

"ఆరోజు జడ్జీలలో నేనొకడిని. మీ నృత్యం చాలా బాగుంది" అన్నా రాయన.

ఆయన ఉద్దేశ్యం నేను గ్రహించి "అవకాశం అనే త్రాడు అందిస్తాం. అందుకొని తారాపథానికి రాగలరా? అని అడుగుతున్నారా మీరు?" అన్నా ఆయన వైపు చూసి నవ్వుతూ.

"అవును" అన్నారాయన ఆశవైపు చూస్తూ.

"సారీ! నాకిష్టం లేదు" అంది ఆమె ముక్తసరిగా.

"ఛేవో! అటువంటి చాన్సువస్తుంటే ఒదులుకోవడం" అంటూ ఆగిపోయారు ప్రక్కనున్న కవిగారు. నాకేమో ఈ సంభాషణ అసలు నచ్చలేదు. ఎక్కడో, ఏమూలో ఈ సంభాణను పొడిగిస్తే మనస్పర్థలు వస్తాయి అని తోచింది. ఎలాగా ఈ పరిస్థితిని తప్పించడం? అని ఆలోచిస్తూండగా నర్మద వచ్చింది. బ్రతికించావు దేవీ అనుకున్నా. నృత్య దర్శకుడికి నా డైరెక్షను చెప్పేసి నర్మదకు సలాం కొట్టి "పదండి పోదాం" అన్నా. ఆశ లేచింది నాతోబాటు.

ఇంటికి వచ్చేశాక ఆశ "మా యింటికి వెళ్దాం రండి" అంది.

"ఎందుకూ?" అన్నా.

"ఏంలేదు. మా అన్నయ్య ఢిల్లీనుంచి వచ్చాడు" అందామె.

"మీ అన్నయ్యవస్తే నేనెందుకండీ?" అన్నా.

"ననెప్పుడూ మా అన్నయ్య విమర్శిస్తుండేవాడు. నా స్నేహితులగురించి ఎప్పుడూ తిడుతుండేవాడు. ఇవ్వాళనాకు ఎంత గొప్ప స్నేహితులున్నారో చూపిద్దామని" అంది.

"నే నంత గొప్పవాడ్ని కాదేమని" అన్నా.

"అసలు మీకు రావాలనుంటేగా" అంది ఆశ బుంగ మూతి పెట్టుకుని.

"నాకు ఏం చేయాలని ఉందీ చెప్పమంటారా?" అన్నా.

"నాకెందుకూ చెప్పడం? మీ ఆలోచనలు ఇంకో కళ్ళకు చెప్పడం అలవాటు లేదేమో" అంది. ఆశ బహు పెంకిది. నిజంగా ఇటువంటి మనస్తత్వం ఉన్నవాళ్ళంటే నా కెంతో ఇష్టం. ఇంకా స్త ఏడిపిద్దామని నేను, "అది స్త్రీ జాతికి ఆభరణం" అన్నా పైకి.

"మరే, ఎవరి ఆభరణమో తెలుస్తూనేఉంది. మద్రాసు వచ్చిన దగ్గరనుంచీ కాస్త ఫ్రీగా మాట్లాడగలిగారూ? ఏదో బరువునెత్తిమీద కెత్తుకున్నామనే అపోహలో ఉండి ఏదేదో అనేస్తున్నారు. ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు మీరు" అంది కోపంగా ఆశ

ఆశ కోపాన్ని ఇంతవరకూ చూడలేదు.

"రామ రామ! అన్నీ అభాండాలు, అబద్ధాలు. ఇదిగో అమ్మాయిగారూ అబద్ధాలు ఆడితే ఆడపిల్లలు పుడ్తారని లోకోక్తి ఉందిసుమా!" అన్నా.

"అంతే. నేను మీలాగా లోపల భావాలు దాచుకో లేను. ఉన్నమాట అనేస్తా. క్షమించండి మీకుకష్టం కలిగిస్తే" అంటూ చివాలున లేచి వెళ్ళిపోయింది.

నాకు నవ్వాగలేదు. గబగబవెళ్ళి కారులో కూర్చున్న ఆశతో, "మరినన్ను తీసుకెళ్ళరూ" అన్నా.

"మీలాంటి గొప్పవాళ్ళు మా యింటికి వస్తారా?" అంటూ కారు స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయింది. బలేగా ఏడ్పించాలే అని సంబరపడుతూ లోపలికివచ్చా.

"రాజ్యలక్ష్మిగారువచ్చి "హలో" అంది.

"హలో పదండి! ఇప్పుడే ఒక అమ్మాయిని ఏడిపించా. ఇంక మిమ్మల్నికూడా ఏడిపిస్తా" అన్నా లోపలికి వెళుతూ.

"పాపం" అంది రాజ్యలక్ష్మిగారు.

"పాపం ఉత్త బోలామనిషి" అన్నా నేను కుర్చీలో కూర్చుంటూ.

"మీకు లెటర్స్ కొన్ని వచ్చాయి"

"అదేమిటి అంతపాప్యులర్ అయ్యానా నేను?" అన్నా.

రాజ్యలక్ష్మి నవ్వి, ఉత్తరాలు ఇచ్చింది. అన్నీకలిపి అయిదు ఉన్నవి. కళ్ళుమూసుకుని పేక కలిపినట్లు కలిపి ఒక ఉత్తరంతీసా. లాయర్ విజయ రాసింది. కవరుచింపి ఉల్లిపొర కాగితంమీద రాసిన నాలుగు ముక్కలను చదివా. "ఎల్లుండి ప్రొద్దున మెయిలుకు మావారు నేను వస్తున్నాం కనుక హోటలులో ఒక రూము చూడవలసిం"దని రాసింది విజయ. విజయనుచూచి ఏడేళ్ళయింది. హైద్రాబాద్‌లో నేను చదువుకుంటున్నరోజులలో ఒకరోజున హాస్టలుకు వచ్చింది

ప్రసాద్‌తోపాటు. ప్రసాద్‌తో పరిచయం చాలా కాలంనుంచీ ఉంది కనుక అతనిరాకకు నేను విస్తుపోలేను. కానీ అతనివెంట కాబోయే భార్యవస్తున్నదంటే కొంచెం ఆశ్చర్యంగానే ఉంది. టీ తీసుకున్నాక "మిమ్మల్ని చూడటానికి వచ్చా" అంది.

అంతే కాలక్షేపం జరిగింది రాత్రి ఏడుగంటలవరకూ. ఆ తర్వాత సిటీలోకి వెళ్ళి ఆనందించాం. ఆ పరిచయం పరిచయంగానే ఉండిపోయింది. నేను అక్కడ ఉన్నంతవరకూ వాళ్ళిద్దరికీ పెళ్ళికాలేదు. కనుక విజయ భర్త ఎవరా? అన్న సందేహం కలిగింది. రాజ్యలక్ష్మిగారితో, ఏదన్నా మంచి హోటలులో రెండురూములు ఒకటి డబల్, ఇంకోటి సింగిల్ బుక్ చేయండి ఒక వారం రోజులకు, ఆ తర్వాత అవసరముంటే ఎక్స్టెండు చేయించవచ్చు" అన్నా.

"అలాగే" అని ఒక చెక్ బుక్ ముందుకు తోసి, "దీని మీద సంతకం పెట్టండి. ఆ తర్వాత నర్మదగారి దగ్గరనుండి డబ్బుతీసుకున్నాక మీ ఎకౌంట్స్‌లో వేసేస్తా" అంది.

"సంతకం పెట్టడానికి నాకేమీ అభ్యంతరం కాదుగానీ ఎవరికీ డబ్బు" అన్నా.

"నర్మదగారికే కావాలి" అంది రాజ్యలక్ష్మి.

"నర్మదకు డబ్బు ఎందుకూ?" అన్నా.

"నర్మదగారు ఒకరికి డబ్బు ఇవ్వాలి. ఆయన ఒత్తిడి చేస్తున్నారు మధ్యాహ్నం లోపల కావాలని. ఆవిడ సంతకం చేసేలోగా బ్యాంకును క్లోజ్ చేస్తారు" అంది రాజ్యలక్ష్మి.

"సరే" అని సంతకం పెడుతూ డబ్బును చూచా. ఆరు వేలకుంది. రాజ్యలక్ష్మి చెక్ బుక్ తీసుకొని వెళ్ళింది. నర్మదకు డబ్బు యెందుకవసరమో అర్థం కాలేదు. ఏదన్నా కారణం ఉందేమోనని ఆలోచించా కానీ నా ఆలోచనలు సమాధా నాన్ని ఇవ్వలేకపోయినవి.

"సార్! భోజనం" అంటూ వచ్చాడు అయ్యారు.

"నర్మద గారు రారూ?" అనడిగా.

"రారటండీ! స్టూడియోలోనే భోజనం చేస్తారంట" అన్నాడు.

భోజనం చేసి రేడియోగ్రాంలో రికార్డులు పెట్టుకుని చేపల తొట్టి కెదురుగుండా కూర్చుని ఇంగ్లీషునవల చదవడం ప్రారంభించా. ఇటువంటి జీవితాన్నే నేకోరుకున్నది. సంగీతం విసుగు పుట్టినపుడు నవలచదువవచ్చు. అదీ విసుగెత్తినపుడు అందంగా ఆడుతున్న చేపల్ని చూస్తూ కూర్చోవచ్చు. నిజంగా ఎంతఆనం దంగా ఉందో ఈ జీవితం అని నాలోనేనే ఆనందం సంతృప్తి అనుభవించా. నిముషాలు గంటలుగా మారిపోతున్నాయి. అలానే సోఫాలో నిద్రపోయా. నర్మద రాకతో సాయంత్రం మెలకువ వచ్చింది.

"ఏం మహాశయా! తీరికగా నిద్రపోతున్నారూ? అని అడిగింది.

"సంతృప్తికోసం" అన్నా.

"సంతృప్తా గాడిదగుడ్డా! మళ్ళీ రాత్రి రెండు గంటల వరకూ మేలుకుని కూర్చోవడంలో గూడా సంతృప్తిఉందా?" అని అడిగింది నర్మద.

"అసలు నిద్ర తెల్లవారుఝామున ఎంత హాయిగా వస్తుందనుకున్నావ్" అన్నా.

"అదీ నిజమే అనుకో. మరిచా. ఎక్కడికైనా వెళ్దాం. వచ్చేవారం అంతా ఖాళీయే" అంది.

"నీకు ఖాళీ ఏమిటి?" అన్నా.

"అదే నాకు ఆశ్చర్యంగావుంది. ఏదో గమ్మత్తు చేసింది రాజ్యలక్ష్మి. వారం ఖాళీ మిగిలింది. ప్రతి నెలా ఇలా వస్తే బాగుండును" అంది నర్మద.

"రాజ్యలక్ష్మి నీకేమన్నా చెప్పిందా?" అన్నా ఇందాకటి సంఘటన గుర్తుకొచ్చి.

"ఆ... ఆఁ డబ్బుగొడవేగా! చెప్పింది" అంది నర్మద.

కొంతసేపెవరమూ మాట్లాడలేదు. "మరిచా చెప్పడం నా స్నేహితులు ఒకరు ఇక్కడికి వస్తున్నారు" అన్నా.

"రానీ ఇక్కడే ఉంటారు" అంది నర్మద.

"కాదు కాదు. వాళ్లు హోటలులో ఉంటామని లెటర్ వ్రాశారు. బహుశా వారం రోజులుంటారేమో" అన్నా.

"అయితే రేపటినుంచి నీకు తీరిక ఉండదన్నమాట" అంది నర్మద.

"అదే నేనూ ఆలోచిస్తున్నా" అని సిగరెట్ వెలిగించుకుంటుండగా ఒక టెలిగ్రాం వచ్చింది. "ప్రోగ్రాం కాన్సిలయ్యింది. ఎప్పుడు వచ్చేదీ తెలుపుతాం" అని ప్రసాద్ తెలిపాడు. నిజంగా ఇదొక మిరాకిల్.

"ఓ కె బాస్. రేపే బయలు దేర్దాం" అన్నా.

"వెరీ వెరీగుడ్" అంటూ లోపలికెళ్ళింది నర్మద.

ప్రయాణం అన్నప్పుడల్లా నాకెంతో ఆనందంగా ఉంటుంది. కాలేజీలో చదువుతున్నపుడు ప్రయాణం చేస్తూ ఊళ్ళు తిరుగుతుంటే ఎంతో హాయిగా ఉండేది నిజంగా ఆ జీవితంలో ఎంత సంతృప్తి. ఆలోచించిన కొలది ఒక ప్రక్క ఆనందం, యింకో ప్రక్క విచారం. ఆ రోజులు రావే అని కలుగుతుంటవి.

"ఏయ్ మిస్టర్! కూరలు బాగున్నాయా?" అంటూ కాఫీ కప్పు చేత్తో పుచ్చుకుని వచ్చింది నర్మద

"స్టూడియోలోవి బాగున్నాయా?" అని అడిగా.

"ముందు మనింట్లో చెబుదూ! తరువాత నేను చెబుతాను" అంది నర్మద.

"నేనేం తిన్నానో నాకే గుర్తులేదు. నీకేం చెప్పేది?" అన్నా.

"భలేగా వుంది. భోజనం చేసి రెండుగంటలు కాలేదు. అప్పుడే మర్చిపోయావా? మహాశయా!" అంది ప్రక్కన కూర్చుంటూ.

"ఆడవాళ్ళకు అలవాటు గుర్తుపెట్టుకోవడం. మాకు లేదుగా" అన్నా తప్పించుకోబోతూ.

"మహా చెప్పొచ్చావులే! మీరు మాత్రం అమ్మాయిల పేర్లు గుర్తు పెట్టుకోరూ?" అంది నర్మద.

"ఓ కే మేడమ్! ఓడిపోయా. సరేగాని రోజుకు ఎన్ని సార్లు కాఫీ త్రాగుతావు?"

"నీవు ఎన్ని సిగరెట్లు త్రాగుతావూ?" అని ఎదురు ప్రశ్న వేసింది నర్మద.

"మళ్ళీ నే ఓడిపోయా" అన్నా నేను.

"అయితేపద అలా తిరిగివద్దాం" అంది నర్మద.

"మరిచా ఇంతవరకూ ఎవ్వరికీఉత్తరాలు రాయలేదు. ఇవాల్టికి వదియ్ నన్ను" అన్నా.

"ఉత్తరాలకేమయ్యా! తర్వాత రాయొచ్చు. ఎప్పుడు ఇంట్లోనే కూర్చుంటా నంటావేమిటి" అంది నర్మద.

"కనీసం దగ్గర మిత్రులకన్నా రాయలేకపోతే బాగుండదు. సినిమాతార సావాసంతో వీడికి గర్వం ఎక్కువైందిరా అంటారు నన్ను" అన్నా.

"అదేం లాభంలేదు. నువ్వు వస్తావా రావా?" అంది సీరియస్‌గా.

నర్మదకు కోపం వచ్చింది అని గ్రహించా. ఇటువంటి వాళ్ళతో వేగటం మహా కష్టం. నిమిష నిమిషానికి వీళ్ళ మూడ్సు మారిపోతుంటాయి. "సరేపద" అంటూ బయటకు వచ్చా. నర్మద కారులో కూర్చుంది. డ్రైవర్ వచ్చాడు. వాడ్ని పొమ్మని నేను డ్రైవ్ చేసుకుంటూ పోర్టికోలో నుంచి బయటకు రాగానే నర్మద, "నేను డ్రైవింగ్ తీసుకుంటా రౌండ్ థానా దగ్గర ఆపు కారును" అంది.

"ఓ.కె" అని రౌండ్ థానాలో కారాపగానే, "షాపింగ్‌కి వెళ్దాం పద" అంది.

"డబ్బు" అన్నా.

"నాదగ్గర ఉందలే" అంది.

ఒక అరడజను చీరలు, రెండు షర్టింగులు, చిన్నపిల్ల లెక్కే గుర్రం, ఆవాశా షర్టింగు తీసుకుంది నర్మద.

"ఇవన్నీ నీకే" అన్నా.

"కాదులే. రేపు వీటితో అవసరంఉంది" అంది బయటకు వస్తూ. వెనకసీట్లో కుర్రాడు పాకెట్స్ పెట్టిన తరువాత నర్మద స్టీరింగ్ ముందు కూర్చుంది. నేను సిగరెట్ వెలిగించి నర్మద ప్రక్కనే కూర్చున్నా నర్మద కారులో కూర్చున్నంతసేపు అదో మాదిరిగఉంది. ఊరికినే ఒకచోటికి అనేది లేకుండా కారు పోనిస్తోంది. ఆందోళన పడుతున్నప్పుడు మనం ఎలా తిరుగుతామో అలానే డ్రైవ్ చేస్తున్నది కారును. ఒకొక్కప్పుడు 60, ఇంకొకప్పుడు 10 మైళ్ళ స్పీడులో పోనిస్తున్నది కారును నర్మద. రోడ్డుమీద లైట్లు వెలిగించారు. డోరుమీదఆనించి పెట్టడంవల్ల తిమ్మిరెక్కిన చేయి తీసి టైంచూశా. ఆరున్నర అయ్యింది. సుమారుగా మూడు గంటలుగా రోడ్డుమీద తిరుగుతున్నా మన్న మాట. "చంటీ" అని కేకేశా. కారును అకస్మాత్తుగా ఆపేసింది నర్మద. నాకేసి చూస్తూ కూర్చుండి పోయింది. కండ్లవెంబడి ధారాపాతంగా నీరు కారుతున్నది. చిన్నప్పుడు నర్మదను నేను "చంటీ"అని పిలిచేవాడిని. ఇక్కడికి వచ్చాక నర్మదను నేను అలా పిలవడం ఇదే మొదటిసారి. కండ్లు తుడుస్తూ "నీలోని బాధను చెప్పుకొంటే కొంత భారం తగ్గుతుందేమో!" అన్నా.

"అబ్బే! ఏమీ లేదు. చిన్నప్పటి జీవితం గుర్తుకు వచ్చింది" అంది మళ్ళా కారును స్టార్ట్ చేస్తూ.

ఈవిడను యిలా ప్రశ్నిస్తే లాభంలేదని "కాఫీ త్రాగి బీచికి వెళ్తే బాగుంటుందేమో!" అన్నా.

"ఊఁ" అన్నది పరధ్యానంగా.

నేను ఇందాకటి మాటే మళ్ళీ అన్నా "ఆ అవును బాగుంటుంది" అంది.

కారు ఇంటికి చేరింది.

రాజ్యలక్ష్మి మాకోసం ఎదురు చూస్తూ కూర్చుంది. రాజ్యలక్ష్మిని చూడగానే "చూడు, పని మనిషితో వారం రోజులు కారు ప్రయాణానికి సరిపడే సరంజామా అంతా పాక్ చేయించు. ట్రావెలర్స్ చెక్స్ ఒక మూడు వేలకి తీసుకో. అలాగే మీ బాబుగారికి కూడాను" అంది నర్మద ఉత్సాహంగా.

"అన్నట్లు వచ్చే వారం అంతా కాల్‌షీట్లు లేవుగా" అన్నా.

"లేదండీ" అంది రాజ్యలక్ష్మి ఎంగేజ్‌మెంట్ బుక్ చూస్తూ.

"వెరీగుడ్" అని లోపలకు వెళ్ళా. బట్టలు మార్చుకుని బయటకు వచ్చా. కాఫీలు రెడీగా వున్నాయి.

"కాఫీ త్రాగాక బీచికి వెళ్దాం అన్నావు" అన్నా.

"ఇప్పుడు వద్దులెద్దూ" అంది నర్మద.

"మరి రేపు తెల్లవారుఝామునే బయలుదేరుదామా" అన్నా.

"ఓ. కె." అంది.

నర్మద ప్రవర్తన నాకు అర్థంకాలేదు. ఎవరికి భయపడి దూరంగా పారిపోతున్నదో అర్థంకాలేదు, తనలోని ఆవేదనను అణగ ద్రొక్కడామని అన్ని విధాలా అహర్నిశలూ బాధ

పడుతున్నది. తనలోని బాధను బయట చెప్పుకోగల శక్తి లేదు. నిజంగా ఈ స్త్రీలలో ఎంతో ఓర్మి ఉంది. మిన్నువిరిగి మీదపడ్డా లోపలికి బాధను అణగ ద్రొక్కుకుంటూ జీవితాన్ని ముఖ్యంగా భర్త జీవితాన్ని ఆనందంగా ఉంచటానికి ప్రయత్నిస్తారు. నిజంగా భారతదేశం గొప్పదనం భారత స్త్రీలే. ఆలోచనలలో చెయ్యెత్తి నమస్కరించా.

"ఎవరికి నమస్కరిస్తున్నారూ?" అంటూ ఆశ వచ్చింది.

"హల్లోరండి" అంటూ లేచా. ఆశ కూర్చున్నాక నేనూ కూర్చున్నా. లోకాభి రామాయణం సాగింది కొంత సేపు. ఇంతలో గుర్తుకొచ్చింది ఆశ పుట్టినరోజు గురించి.

"ఒకమాట చెప్తా వింటారా?" అన్నా.

"చెప్పండి! ఎప్పుడు వినలేదు?" అంది.

"సరేలే. అయితే రేపు బెజవాడ వెళ్దాం వస్తారా?" అని అడిగా.

"క్షమించాలి. నేను రాలేను" అంది.

"మీ పరిస్థితులు గురించి నాకు తెలుసు. అయినా అడగాలనిపించింది. ముఖ్యంగా మీ బర్త్‌డే మిస్ అవుతు న్నాను. మరినన్ను క్షమిస్తారా?" అన్నా.

"క్షమించడానికి నే నెవర్ని? ఆహ్వానం అందచేస్తాం కానీ, బలవంతపెట్టి లాక్కు పోలేంగా" అంది నిష్ఠూరంగా.

"అభాండాలు వేసేటప్పుడు ఇతరుల పరిస్థితిని అర్థం చేసుకోవాలి ఆశాదేవీ! నర్మదకు రేపటినుంచీ ఒక వారం రోజులు ఖాళీ. ఆమె మనస్సు విశ్రాంతి కోరుతున్నది. నాకు

ఈ జీవితం విసుగుపుడ్తున్నది. కానీ పరిస్థితులకు బానిసలం మేమిద్దరమూ. విశ్రాంతి లభ్యమైనప్పుడు ఆనందించడం అల వాటు పడినవాణ్ని. నాకోసం కాకపోయినా నర్మదకోసమైనా నేను ఆమెతో వెళ్ళాలి నా ఈ జీవితానికి ఆమె పునాదిరాయి వేసింది. ఆ మాత్రం కృతజ్ఞత తెలియపర్చకపోతే ఎట్లా'' అన్నాను.

''నిజంగా మీరు మారారు. మీలో మునుపు నిష్క ల్మషత్వం ఉండేది. అది ఇప్పుడు లేదు. నా జీవితంతో ఆడు తున్నారు. ఆడండి. నశించేది ఎల్లప్పుడూ స్త్రీయే,'' అంటూ ఏడుస్తూ గబగబ బయటకు వెళ్ళిపోయింది ఆశ. ''నేను నిరుత్త రుడనై అలానే కూర్చుండిపోయాను.

# 5

ఏమిటీ పరిణామాలు! ఆశ ఎందుకలా ప్రవర్తించింది? ఆశ అలా ప్రవర్తించటానికి నేను ఆమెకు ఏ ఆశలూ చూప లేదు. కనీసం మేం ఇద్దరమూ ప్రేమికులులాగా మెలగలేదు. ఏం చెయ్యాలి? ఏం తోచడం లేదు. ఇటువంటి పరిస్థితులంటే అమితమయిన భయం నాకు. ఎందుకంటే ముందు చూస్తే గొయ్యి, వెనక చూస్తే నుయ్యి కనపడుతుంది. ఏం చేయాలి? ఎలా ప్రవర్తించాలి? ఆశతో ఎలా మాటాడాలి. నర్మదతో ఏమని చెప్పాలి? రేపు నర్మదతో వెళ్ళాలా? వద్దా? ఇటువంటి పరిస్థితిలో వెంకట్రావు గాని, శాస్త్రిగాని వుంటే సలహాలన్నా యిచ్చేవాళ్ళు. ఒకవేళ నర్మదను అడుగుతే... ఛాఛా ఆమెను అడుగుతే యేం బాగుంటుంది? టైము చూసేటప్పటికి గుండె

గాభరా ఎక్కింది. గబగబా రూంలోకి వెళ్ళా. సోనారిల్ మాత్రలు వేసుకొని నిద్రపోయా. ప్రశాంతతతో నిద్రపోగల నని ఆశించా. కానీ నా ఆసలన్నీ అడియాసలయ్యాయి. తెల్ల వారుఝామున నాలుగు గంటలకు నర్మద వచ్చి లేపింది.

కాలకృత్యాలు అయ్యాక నా కారులో బయలుదేరాం. నర్మద కారు నడుపుతున్నది. మళ్ళీ నిద్రపోయాను. యెండ చుర్రుమని తగిలేటప్పటికి లేచా. కారు వేగంగా పోతున్నది. మీటర్ కేసి చూశా. 55 చూపిస్తున్నది. నర్మద కేసి చూసా. నల్లటి గాగుల్స్ పెట్టుకొన్నది. తెల్లని చీరె, తెల్లటి బ్లౌజు, ఎర్రని స్కార్ఫ్ తలకు కట్టుకున్నది ఎండలో తళతళ మెరుస్తూ స్వచ్ఛమైన కాంతులీనుతున్నాయి ఆమె దుస్తులు. ప్రక్కన హాండ్ బ్యాగ్ తీసి అందులో కెమేరాతో ఒక స్నాప్ షాట్ తీశా. నర్మద నా కేసి తిరిగి నవ్వింది

"వర్నించమంటావా?" అన్నా.

"వద్దులే సిగరెట్ వెలిగించుకొని ఫ్లాస్కులో కాఫీ త్రాగు" అంది నర్మద.

"మరి నీకో?" అన్నా సిగరెట్ వెలిగించుకుంటూ.

"నాకు కూడానూ" అంది నర్మద. కాఫీ త్రాగాం ఇద్దరమూ.

"ఆ ఇప్పుడు మాట్లాడు" అన్నా.

"ఏం మాట్లాడేది?" అని అడిగింది నర్మద.

కాలం గడిచిపోయింది. బెజవాడ రాత్రి 7 గంటలకు చేరాం. హోటలులో రూము తీసుకుని సామాన్లు వేసి బయటకు వచ్చాం.

"కృష్ణ ఒడ్డుకు వెళ్దామా?" అన్నా. తలూపింది.

శ్మశానాలమీదనుంచీ కృష్ణఒడ్డుకు వెళ్ళాం. రేడియో పెట్టుకుని కూర్చున్నాం. నర్మద నా ప్రక్కన కూర్చుని, "నీకు శ్మశానం అంటే భయంలేదూ?" అనిఅడిగింది అమాయకంగా నాకు నవ్వాగలేదు.

నేను నవ్వుతుండగా ఉడికిపోయి, "ఎందుకమ్మా నవ్వుతావు? పెద్ద నీకు భయం లేనట్లు" అంది.

నేను నవ్వు ఆపి, "అదికాదు నర్మదా! శ్మశానాలలో దయ్యాలుంటాయని మనం భయపడతాం. అంతకన్నా ఘోరమైన ప్రవృత్తిగల మానవులు మనతో ఉన్నారు కదా, వాళ్ళను చూచి భయపడమేం మనం" అన్నా.

"బాబూ ఆపు నీ ధోరణి. అలా కనకదుర్గగుడికి వెళ్దాం పద" అంది.

"సరేపద" అంటూలేచి, "మళ్ళీ శ్మశానాలు వస్తున్నాయి, కళ్ళుమూసుకో" అన్నా కారులోకి ఎక్కుతూ. తనూ నవ్వేసి కారులో కెక్కి కూర్చుంది.

గుడిలోకివెళ్ళాం. దేవీదర్శనం చేసుకున్నాక ప్రసాదం తింటూ కూర్చున్నాం. ప్రసాదాలు తిన్నాక తలఎత్తేసరికి మా చుట్టూ జనంమూగారు. పరిస్థితిని అర్థం చేసుకున్నాం ఇద్దరమూ. అందరికీ నమస్కరించి నెమ్మదిగా మెట్లనుదిగడం ప్రారంభించాం. తడబడుతున్న హృదయాలతో వారూ మా వెనకాలే దిగుతున్నారు. కారులో కూర్చున్నాక గుంపులోంచి "ఒకపాట పాడాలి" అన్నారు.

నాకు నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. "వస్తాం" అంటూ అందరికి నమస్కరించాం ఇద్దరమూ. కారును స్టార్ట్ చేయగానే జనం తప్పుకున్నారు. ట్రాఫిక్ చాలా ఎక్కువగా ఉంది.

"అంత తేలికగా వదులుతారనుకోలేదు" అంది నర్మద.

"మనం ఎంతో అదృష్టవంతులం" అన్నా.

"తిన్నగా నువ్వు అన్న ఊరుకెళ్ళి మళ్ళీ రాత్రికి తిరిగి వద్దాం" అంది నర్మద.

"ఓ.కె. అయితే పోదామా?" అన్నా.

"ముందు కారు హోటలుకు పోనీయి" అంది.

హోటలులో పెట్టిన సామాన్లు వేసుకుని కంకిపాడు వెళ్ళాం. ఊళ్లో ఇల్లు కనుక్కునేటప్పటికి గగనం అయింది.

ఇంట్లోనుంచి ఏడుపులు వినపడుతున్నాయి. "అదేమిటి బాబూ?" అంది నర్మద.

"ఏంలేదు. నువ్వు కారులోకూర్చో" అంటూ క్రిందకు దిగా. గుమ్మం దగ్గరకు వెళ్లా. గుమ్మానికి ప్రక్కగా ఒక మంచంమీద పసిపిల్లాడు పండుకుని ఉన్నాడు. చీపురుపుల్లల్లాగా ఉన్నకాళ్ళు చేతులు, జ్యోతుల్లాగా వెలుగుతున్నకళ్లు. అతనిచుట్టూ రవీ, వాడిభార్యా, ఇద్దరు పిల్లలూ కూర్చుని ఏడుస్తున్నారు. దృశ్యం ఘోరంగాఉంది. ఏమూల చూచినా దరిద్రదేవత నవ్వు వినిపిస్తున్నది. ఏవైపు చూచినా దరిద్రదేవత విలయతాండవం కనపడుతున్నది. "రవీ" అని పిలచా నెమ్మదిగా. రవి తలెత్తి చూచాడు. తైల సంస్కారంలేని

తల నిరాశా పూరితమైన చూపులు. వాడ్ని చూడగానే హృదయంలో ఏదో పెట్టి దేవినట్లయింది. చిలిపిచూపులతో, అర్థంకాని భావాలతో ఊగిసలాడ్తూ ఉప్పొంగి పోయే రవేనా ఊరవి? అనిపించింది వాడ్ని చూడగానే.

"రా బ్రదర్" అన్నాడు లోపలికి ఆహ్వానిస్తూ. గబగబ పసిపిల్లవాడి దగ్గరకువెళ్ళి చూచా :Tatamees అంటే ధనుర్వాతం. "ఈఊళ్లో డాక్టరు లేడా?" అన్నా.

"ఉన్నాడు కానీ డబ్బులేదు" అన్నాడు.

"సరే మందు తీసుకువస్తాఉండు" అని నేను బయటకు నడుస్తుంటే, "నీకివ్వడానికి డబ్బులేదు నా దగ్గిర" అన్నాడు. నాకు కండ్లవెంబడి నీళ్ళు గిర్రున తిరిగినయి.

"నీ విక్కడేఉండు. మీ ఆవిడకు ధైర్యం చెప్తూండు" అంటూ గబగబ వెళ్ళి కారులో కూర్చున్నా. కారు స్టార్టు చేస్తుంటే నర్మద, "మనం ఇప్పుడు ఎక్కడికి వెళ్తున్నాం?" అని అడిగింది.

"బెజవాడ" అంటూ ఏక్సిలేటర్‌ను బలంగా త్రొక్కాను.

దారిలో జరిగిన సంగతి అంతా చెప్పాక, "నన్ను అక్కడ ఉంచెయ్యాల్సింది. పాపం ఆవిడ ఒక్కతే ఉందికదా" అంది నర్మద బాధపడుతూ.

బెజవాడలో **Antetanes Serum** సిరంజీలు కొని మళ్ళీ కంకిపాడు వచ్చాం. పిల్లవాడికి ఇంజక్షనులు ఇస్తూ రాత్రంతా మేల్కొన్నా. తెల్లవారింది. పిల్లవాడు గండం

గడచి బయట పడ్డాడు. మనస్సుశరీరం అలసిపోయి ఉన్నాయి. నర్మద నాదగ్గిరకు వచ్చి "మనం వెళ్ళిపోదాం పద" అంది.

నాకు ఆశ్చర్యంవేసింది, "మద్రాసునుండి వీళ్ళను చూద్దామనివచ్చి కొన్ని గంటలలోనే తిరుగు ప్రయాణమా?" అన్నా నా చిరాకును అణగద్రొక్కుకుని.

"నాకు ఇక్కడ ఉండాలని లేదు. దయయుంచి ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం పదండి" అంది బొంగురుపోయిన కంఠంతో.

"అసలు సంగతేమిటి?" అన్నా.

ఇంతలో ఉష వచ్చింది కాఫీ పట్టుకుని. "ఉషా ఈవిడ పేరు నర్మద. నా స్నేహితురాలు" అని నర్మదను పరిచయం చేసా.

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా ఆనందంగా ఉంది" అని నావైపు తిరిగి, "అన్నయ్యా నా బాబుకు ప్రాణ దానం చేసావు" అంటూ నా కాళ్ళమీద వాలింది. నావంటి మీద తేళ్ళు జెర్రులు ప్రాకాయి. ఆవిడ కృతజ్ఞత స్వీకరించ డానికి నాకర్హత లేనప్పుడు నేను ఆవిడ అందించిన అనురా గాన్ని ఎలా స్వీకరించేది. ఉషను లేవదీసి, "నాకు అవన్నీ అక్కర్లేదు చెల్లీ" అన్నా.

ఇంతలో రవి వచ్చాడు. వాడు రాగానే నర్మద బయ టకు వెళ్ళింది. కొంతసేపటిలో పిల్లలు నర్మద తెచ్చిన ఆట వస్తువులు అందుకుని ఆనందంతో గంతులు వేస్తున్నారు. నర్మద రాగానే, "ఇలాపైవూరికి వెళ్ళి వస్తున్నాం. దారిలో

మీరున్నారని వీరు చెప్పారు. ఇంక వస్తాంఅండి" అంది నర్మద నమస్కరిస్తూ. రవి బలవంత పెట్టలేదు.

మేము బయటకు వచ్చాం. పిల్లలు మావెంటవస్తామని ఏడుస్తున్నారు. వారిచేతిలో తలా పదిరూపాయల కాగితంపెట్టి కారు ఎక్కింది నర్మద.

కంకిపాడు దాటగానే నర్మదవైపుచూశా. ఏడుస్తున్నది. "అదేమిటి అలా ఏడుస్తున్నావు?" అన్నా.

"మూడు వాళ్ళజీవితం దుర్భరం, ఎలా బ్రతుకుతున్నారో" అంది.

"ఆ దారిద్ర్యం వాళ్లకు అలవాటే. వాళ్ళజీవితాలకది మామూలయిపోయింది" అన్నా. డాష్‌బోర్డులోనుంచీ సిగరెట్ తీసుకుని వెలిగించుకుంటూ కళ్ళు మండుతున్నాయి. చాలా చెడ్డ చికాకుగా ఉంది. రాత్రంతా నిద్రలేదు. తలనొప్పిదం చేస్తున్నది. ఈ చిరాకులో ఏం మాట్లాడానో నాకే తెలియదు. బెజవాడవచ్చిన తరువాత మేము దిగిన హోటలు దగ్గరకు వచ్చాం. మాకు ఒక టెలిగ్రాం వచ్చింది. రాజేశ్వరి యిచ్చింది. రెడ్ ఎక్స్ అంటే సినిమాజీవులమీద వ్రాసే పత్రిక. హోటల్ బాయ్‌ని పిలచి, "ఫలానా పత్రిక పట్టుకురా" అన్నా. వాడు వెళ్ళిపోయాక బట్టలు విడిచి పైజమా లాల్చీ వేసుకుని మంచంమీద పడుకున్నా. నిద్రపట్టింది.

నేను మళ్ళీ లేచేసరికి నర్మద స్నానంచేసి ఆ పత్రిక చూస్తూ నవ్వుతున్నది.

నేను లేవడంచూసి పత్రిక నామీద పడేసింది. దాంట్లో "నర్మద పరార్. అభివృద్ధిలోకి వస్తున్న డైరక్టరు, రాజ్‌

నర్మదకలిసి హనీమూన్ ట్రిప్‌కి వెళ్ళారా? వివరాలు వచ్చే సంచికలో చూడండి” అనిఉంది.

“స్నానం చెయ్యి బ్రదర్ త్వరగా పోదాం” అంది నర్మద.

“ఓ. కే.” అని స్నానానికి వెళ్ళిపోయా. స్నానం చేస్తున్నంతసేపూ ఆశగుర్తుకొచ్చింది. పాపం ఆ అమ్మాయి మనస్సు కష్టపెట్టా.

“నర్మదా! ఇప్పుడే బయలుదేర్దామా?” అన్నా లోపలనుంచీ.

“అదిసరేలే, త్వరగా రావయ్యా మహానుభావా అన్నం చల్లారిపోతుంది” అని కేక వేసింది.

త్వరగా తెముల్చుకుని భోజనం అయ్యాక సామానులు అంతా సర్దింది నర్మద. హోటలు బిల్లు చెల్లించి బయలుదేరాం. 3 గంటలయ్యింది. బాక్ సీట్‌లో నర్మద నిద్రపోతున్నది.

రేడియో పెట్టుకుని వింటూ, సిగరెట్ కాల్చుకుంటూ 7 గంటలవరకూ డ్రైవింగ్ చేసా. ఆకాశమంతా మేఘావృతమైఉంది. చిమ్మ చీకటి. కారు ఆపి బయటకుదిగి ఫ్లాస్కులోని టీ పోసుకుని త్రాగుతూ నిలబడ్డా. చుట్టూ చిమ్మచీకటి. నిశి భయంకరంగా ఉంది. కీచు రాళ్ళు ఊరికినే గోలచేస్తున్నవి. ములగచెట్లమీద మిణుగురు పురుగులు మెరుస్తూ, సినిమాలో మంత్రాల మఱ్ఱిదగ్గిరకు వెళ్తున్నప్పుడు కనిపించే దృశ్యాన్ని గుర్తుకు తెస్తున్నది. ఉక్కగాఉంది. షర్టువిప్పి లోపల పడవేసా. నర్మద అలాగే నిద్రపోతున్నది. పైటతొలగిపోగా కన్పిస్తున్న

యవ్వనం నాలో ఏవో కోరికలు రేపాయి. నాలోని పశుత్వం మేల్కొంటున్నది. ఫ్రంట్ డోర్ వేసి బాక్ డోరు తీయ బోతున్నా. చల్లని చినుకులుమీద పడ్డవి. వర్షం ప్రారంభ మయ్యింది. ఆకాశంలోకి చూచా. భయంకరంగాఉంది. దూరంగా మెరపులు మెరుస్తున్నాయి. తీసిన డోర్ మూసేసి మళ్ళీ స్టీరింగ్ మీద కూర్చున్నా. రేడియో వాల్యూమ్ హెచ్చించి స్టార్టు చేసా. ఆ కుదుపుకు నర్మదలేచింది. "భలే నిద్రపట్టింది" అంటూ. బయటకుచూచి "వర్షం ప్రారంభ మయినట్లుందే" అంది.

"ఊ" అన్నా. మనస్సంతా అల్లకల్లోలంగా ఉంది. టీ పోసుకుని త్రాగుతూ. "నేను స్టీరింగ్ తీసుకోనా!" అంది.

"ఫరవాలేదు లే నిద్రపో" అన్నా.

"ఓ.కె" అని మూలనున్న "లైఫ్" తీసుకుని చదువ నారంభించింది.

"రేపు ఆశ బర్త్ డే" అన్నా సిగరెట్ వెలిగించు కుంటూ.

"తెలుసు. ఆశ నీకు చెప్తుండగా విన్నా" అంది.

నేను మాట్లాడలేదు. స్పీడ్ మీటర్ అరవై చూపు తున్నది. వర్షం బాగా కురుస్తున్నది. రోడ్ అసలు కనపడటం లేదు.

"జీవితంలో ఏదన్నా చేయాలనుకుంటే ఒక నిశ్చ యానికి త్వరగా రావాలి మిస్టర్" అంది నర్మద.

"మనకారుకు ఫాగ్ లైట్ వేయించాలి" అన్నా సంభాషణను మారుస్తూ.

ఆ తర్వాత ఎవరూ మాట్లాడలేదు. తెల్లవారు ఝామున 4 గంటలకు ఇంటికి చేరాం.

రాజ్యలక్ష్మి టేబిల్ మీద ఆశకు మేం వచ్చినట్లు ఫోన్ చేయమని చీటీపెట్టి 8-30 గంటలకు అలారంపెట్టి ఇద్దరం నా రూములోనే నిద్రపోయాం. నేను సోఫాలో, నర్మద నా ప్రక్క మీద.

అలసి ఉన్న నన్ను నిద్రాదేవి ఒడిలోకి తీసుకుంది. అల్ల కల్లోలమైన మనస్సు మత్తుగా విశ్రాంతి తీసుకుంది. ఆ తల్లి చల్లని నీడలో మత్తెక్కిన మనస్సు మేల్కొనేసరికి 11 అయ్యింది. నర్మద ఇంకా అలానే నిద్రపోతున్నది. మొట్ట మొదటిసారిగా రైలు కంపార్టు మెంటులో నిద్రలో చిరు నవ్వులు కురిపించిన నా నర్మద మళ్ళీ నాకు పునర్దర్శనం ఇచ్చింది. దగ్గిరగా వెళ్ళి తలనిమురుతూ, "చంటీ" అన్నా.

"ఊఁ" అంది మత్తుగా మూల్గుతూ.

"10 గంటలయ్యింది. ఇవ్వాళ ఆశపుట్టినరోజు. త్వరగా వెళ్దాం లే" అన్నా.

వెనకాల చప్పుడైంది. జేవురించిన మొహంతో ఆశ ప్రత్యక్షమైంది.

"హాపీ బర్త్డే" అన్నా. ఆశ మాట్లాడలేదు. దగ్గిర కెళ్ళి, "హాపీ బర్త్డే" అన్నా గట్టిగా.

"థాంక్యూ" అంది సర్దుకుని.

"ఎంత సేపయ్యింది వచ్చి?" అన్నా.

"మూడుగంటలయ్యింది" అంది ఆశ.

"మరి లేపలేదే?" అన్నా.

"అలసి ఉన్నారుగా ! అందుకని"

"అవును నిజమే ఆశా. రాత్రంతా నిద్రలేదు" అన్నా బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ.

"వస్తా, మధ్యాహ్నం తప్పకుండా వస్తారుకదూ" అని వెళ్ళిపోబోతున్న ఆశను ఆపి, "కాసేపాగండి. నేనూ 5 నిముషాలలో తయారయి వస్తా అలా బజారుకు వెళ్దాం" అన్నా.

"సరే" అంటూ సోఫాలో కూర్చుంది ఆశ.

స్నానం చేస్తుండగా నర్మద బాత్‌రూమ్ డోర్‌తట్టి, "త్వరగా తెములు నీకో అర్జంటు కబురు చెప్పాలి" అంది.

"అయిపోయింది వస్తున్నా" అంటూ త్వరగా ముగించుకొని బయటకు వచ్చా

డ్రాయింగ్ రూములో నర్మద, ఆశ, రామమూర్తి గారు కూర్చుని ఉన్నారు.

"నమస్తే" అన్నా.

"నమస్తే. ప్రయాణం బాగా జరిగిందా?" అనడిగారు.

"నర్మదగారినే అడగండి" అన్నా.

ఆయన నవ్వి, "ఇవాళనుంచీ వారంరోజులవరకూ ఫ్లోర్ దొరికింది. షూటింగ్ మొదలు పెడ్దామా?" అన్నారాయన.

"మేం రావడంచూచి మంచిదే అయిందన్నమాట" అన్నా.

"ఊ, ఈ పిక్చరు తప్పకుండా సక్సెస్ అవుతుందని నా నమ్మకం. అన్నీ కలిసి వస్తున్నాయి" అన్నారాయన.

"మేంకోరేదీ అదే. సరిగ్గా నాలుగున్నరకు వస్తాం. క్షమించాలి" అన్నా.

"సరే" అన్నారాయన లేస్తూ.

ఆయన వెళ్ళిపోయారు.

"బజారుకెళ్దామన్నారు" అంది ఆశ.

"పదండి" అంటూనే బయలుదేరా. ఆశ డ్రైవింగ్ చేస్తున్నది.

"ఏ ఊరెళ్ళారు? వెళ్ళిన పని సాఫల్యం అయిందా" అంది ఆశ.

"ఆ. అంతా అయ్యింది" అన్నా.

"ఏం కొనాలి?" అని అడిగింది ఆశ.

"ఒక వాచీ కొనాలి ఒకళ్ళకి. అది మీరే సెలక్టు చేయండి" అన్నా నేను. లేడీ వాచీకొని, ఆ తర్వాత ఒక పోర్టబుల్ రేడియో కొన్నా.

ఆశ నన్నింటివద్ద డ్రాప్ చేసింది. నర్మద స్నానంచేసి తల ఆరబెట్టుకుంటున్నది. "బ్రదర్ రేపటినుంచీ 24 గంటలూ పనే" అంది.

"ఏమిటీ అంతయిది?" అన్నా.

"నీవు ఇక్కడికి ఒచ్చినరోజున ఒక కాంట్రాక్టు రాశాను గుర్తుందా?" అని అడిగింది.

"ఊ" అన్నా.

"ఆ పిక్చరు కాల్‌షీట్ రేపు ఆరుగంటలనుంచీ మొదలు అవుతుంది. మధ్యాహ్నంనుంచీ నీ పిక్చరు కాల్‌షీట్, ఏడు గంటలనుంచీ తమిళం పిక్చరు" అంది.

"మరి నీ ఆరోగ్యం?" అన్నా.

"నిజంగా చెప్తున్నా. చేతినిండా పనిఉంటే ఏరోగం దగ్గిరకు రాదనుకో" అంది.

"సరే ఆశ ఇంటికి ఎప్పుడు వెళ్దాం?" అన్నా.

"భోజనంచేసి వెళ్దాం" అంది.

"అయితే నేనొక నిద్రతీస్తా" అన్నా.

"ఛా, ఛా. ఇప్పుడు నిద్రేమిటి. ఆ తర్వాత చాలా బద్ధకముగా ఉంటుంది. ఆ మరిచా! రామమూర్తిగారితో మాట్లాడవూ ఈరోజు షూటింగ్ గురించి".

"బాబోయ్ మర్చిపోయాం. చెప్పావు చాలా మంచి దయ్యింది" అని మూడుగంటలవరకూ టెలిఫోనుదగ్గరే కూర్చున్నా. ఈలోపుగా ఆశ ఫోన్ చేసింది.

నర్మద, నేనూ తయారయి ఆశయింటికెళ్ళాం. ఆశ స్నేహితులంతా మమ్మల్ని చూడగానే మమ్మల్ని చుట్టు ముట్టారు. వాళ్ళందరితోనూ మాట్లాడి, ఆశ నాన్నగారితో హస్కు ప్రారంభించాం. నాలుగయ్యింది. ఆశను ప్రక్కకు పిలచి నేనుకొన్నవాచి నా తరఫునా, నర్మద తరఫున రేడియో బహూకరించాను. ఆశ వీణపుచ్చుకొని కృతులు వాయించ నారంభించింది.

నాలుగున్నర అవ్వటానికి ఇంకా ఐదు నిమిషాలుంది. "ఎలా బయటపడాలి?" అనుకుంటూ నర్మదవైపు చూచా. నర్మద నాకేసిచూసి నా ప్రక్కనేఉన్న ఆశనాన్నగారు పార్థ సారథి నాయుడుగార్ని చూపించింది. బ్రతికించావు అనుకుని

కూతురుపాటలో మునిగిపోయిన ఆయనను లేపి పరిస్థితులన్నీ వివరించి వెళ్ళిపోయాం.

షూటింగ్ వారంరోజులు ఏకువ్మడిగా సాగిపోతున్నది. కాల్ షీట్ లేనిసమయాల్లో రికార్డింగ్ పనిపెట్టుకుని కూర్చున్నా. నిజంగా నర్మద చెప్పినట్లు చేతినిండా పనిఉంటే ఎంత హాయిగా ఉంటుంది. ఈ వారంరోజులు మా గురించీ మేం మర్చిపోయాం. ఆశ వస్తూ పోతూ ఉన్నది. ఆశతో ఉన్నంత సేపూ ఒక వాతావరణం, స్టూడియోలో ఉన్నంతసేపూ ఇంకో వాతావరణం, రికార్డింగ్ రూములో వేరొక వాతా వరణం. ఈ మూడింటిలో రికార్డింగ్ రూములో మాత్రము చాలా విసుగువచ్చేది. ప్రతీసారీ మ్యూజిక్ డైరక్టరుకో, ప్లేబాకు ఆర్టిస్టులకు ఆ పాట చిత్రీకరణం గురించి వివరించాల్సి వచ్చేది. నాకు సంగీతంరాదు. కానీ ఎలా ఉంటే సంగీత వీను లకు వినదాతుందో చెప్పగలను. అందుకనే కాబోలు నాకు విసుగు కలిగేది ఆ గదిలో. కానీ ఒకటి, ఎంత మనస్సుల్లో కల్మషమున్నా అంతా భాయి, భాయి. ఆ వాతావరణంలో ఎంతో హాయిగా ఉండేది. షూటింగ్ జరిగేటప్పుడు నర్మద ఎంతో అల్లరిచేసేది. హీరోగారు ఆలస్యం చేస్తే సన్న సన్నగా చీవాట్లు తగిలించేవారు రామమూర్తిగారు. మా షూటింగ్ లు చూడటానికి వచ్చిన వ్యక్తులు మా షూటింగ్ లకు అంత రాయం కలిగించేవాళ్ళు. మరీ ఒకరోజు కాల్ షీట్ **అంతా** బోరింగ్ గాఉంది. హీరోయిన్, హీరోయొక్క నమ్మకద్రోహాన్ని తెలుసుకుని తిడ్తుంది. హీరో తనతప్పు కాదనీ పరిస్థితులు అలా చేసాయనీ నచ్చచెప్ప చూస్తాడు. అంతా అయ్యాక రెండు

నిముషాలు అలానే ఉండిపోతారు. ఆమెలో కోపం, ముందు గతి ఏమిటా అనే ఆవేదన, వీడ్ని ఏంచేయ్యాలా అని ఆలోచన, ఇలా మోసపోయానేమిటా అని అవమానం ఇవన్నీ ప్రస్ఫుటమౌతవి. అతనిలో ఈవిడని ఎలా బయటకు పంపాలా అని ఆలోచన, ఈవిడ ముందు ఏంచేస్తుందా అని భయం, అరే పాపం ఇలా అయిపోయిందే ఈవిడగతి అని జాలీ. ఈ విభిన్న భావాలు ప్రేక్షకులకు ప్రస్ఫుటమౌతాయి ఆ రెండు నిముషాలలో. కానీ ఆ దృశ్యం మాత్రం మమ్మల్ని చంపి వదిలిపెట్టింది.

ఆ భావాలు నర్మదలోనూ రావడంలేదు, హీరో లోనూ రావడంలేదు. ఇంకా కాల్‌షీట్ అయిపోడానికి గంట మాత్రమే వుంది. రామమూర్తిగారు తొందరపడుతున్నారు. ఆఖరికి హీరో భావాలు షూటింగ్ అయ్యింది. నర్మద నాలుగు సార్లు ఫెయిల్ అయ్యాక అయిదోసారి సరైన భావాలు చూపించ నారంభించింది "టేక్" అని నేను అరిచా. కెమారా ముందుకు రోల్ అయ్యింది. సరిగ్గా ఆ సమయంలో విజిటర్స్ లోంచే "ఆచ్చి" అని తుమ్మారు. "కట్" అన్నా. కోపం ఆగటంలేదు. నర్మద పకపకామని నవ్వేసింది. అంత హడా విడీ చప్పున చల్లారిపోయింది. ఆరుగంటల శ్రమ బూడిదలో పోసిన పన్నీరయ్యిందనుకుంటుంటే నర్మద విజిటర్స్‌వంక తిరిగి "సరిగ్గా అయిదు నిముషాలు మీరు బయట ఉంటే మీకు వచ్చి పాట వినిపిస్తా" అంది. అంతా బయటకువెళ్ళిపోయారు. "కమాన్ డైరెక్టర్ స్టార్ట్" అని అరచింది నర్మద. సిజంగా నర్మద మంచిభావాలు చూపిస్తుంది. ఇంతవరకూ జరిగిందంతా

మర్చిపోయి, మాకు కావల్సినట్టుగా నడచింది. మళ్ళీ రీకట్ అవ్వకుండా చేసింది నటన. ఆ తర్వాత ఆ రెండు నిముషాలు అయ్యాక ఫడేల్‌మని చెంపదెబ్బ కొడ్తుంది హీరోయిన్. ఆ సీనుకూడా అయిపోయింది. ఆరోజున కాల్‌షీట్ "48" అలా జరిగింది.

ఇలా రోజులు గడుస్తున్నాయి. పిక్చరు కంప్లీటు అవ్వొచ్చింది. రికార్డింగ్ వర్క్ అంతా అయిపోయింది. నిజంగా నేను అదృష్టవంతుడ్ని. నా భావాలతో ఏకీభవించే టెక్నిషియన్సు ఆర్టిస్ట్సు అంతా దొరికారు. నా ప్రథమ ప్రయత్నంలో విజయం పొందుతానని ధైర్యం ఉంది.

ఆరోజు రాత్రి కన్నమరాలో డిన్నరు పార్టీ ఇస్తున్నారు రామమూర్తిగారు మా టెక్నీషియన్సుకంతా గర్వంగా ఉంది ఇంత త్వరలో పిక్చరును ముగించినందుకు. కానీ కొన్ని పుకార్లు వస్తున్నాయి, నెలలు నిండకుండా పుట్టిన పిల్లాడు అల్పాయుష్కుడే అని. ఏం చెయ్యాలి? ఈ పరిశ్రమకు నేను క్రొత్తవాడ్ని. ఉత్సాహం ఉందినాలో. కానీ అనుభవం తక్కువేమోనని అనుమానం. నర్మద ఇంకా రాలేదు. ఆమె కోసం అంతా ఎదురుచుస్తున్నాం. నేను ఫోన్ చేసా స్టూడియోకు. ఇప్పుడే వెళ్ళిందన్నారు. ఇంటికి ఫోన్ చేసా. ఇప్పుడే పార్టీకి వెళ్ళిందన్నారు. బయలుదేరితే 10 నిముషాలలో వచ్చెయ్యాలి. ఇంకా రాలేదు. అరగంట అయ్యింది. ఈవిడ అసలే మూడ్సులో పడిపోతుంటుంది. ఎక్కడైనా కారు ప్రమాదం జరిగిందేమోనని అనుమానంగా ఉంది. ఇంక ఉండలేక, "నేను తీసుకువస్తాలెండి" అని బయలు

దేరబోతుంటే నర్మద ఎదురుపడింది. ఆమెను చూస్తూండగానే జరగరానిదేదో జరిగింది అని తెలుస్తున్నది. పెదాలు వణుకుతున్నాయి. అంతర్గతంగా అణగద్రొక్క ప్రయత్నిస్తున్న ఆవేదన కళ్ళల్లో ప్రస్ఫుటమౌతున్నది. ఈ భావాలన్నీ నేను చూచింది ఒక్క అరనిముషం మాత్రమే. ఆ తర్వాత మామూలు నర్మదై పోయింది.

"క్షమించాలి. అనుకోకుండా ఆలస్యం అయ్యింది. చాలా సిగ్గుగా ఉంది. అందరు మన్నిస్తారని ఆశిస్తున్నా" అంది అందర్కి నమస్కరిస్తూ.

"ఫరవాలేదు. మీరంతగా క్షమాపణ కోరనవసరం లేదు" అన్నా నేను. నాతో అందరూ అంగీకరించారు. పార్టీ చాలా కోలాహలంగానూ, ఆనందంగానూ, ఉత్సాహంగానూ గడిచింది

పార్టీ అయ్యాక రామమూర్తిగారు లేచి ఉపన్యశించారు. ఆయన పిక్చరు బాక్సాఫీసు అయితే ఆ ఆనందం తనదిగాదనీ. అదృష్టం కలిసివస్తే ఇదే టెక్నీషియన్సుతో మళ్ళీ ఇంకో పిక్చరు ప్రారంభిస్తాననీ, ఈసారి కథ పౌరాణికమైనదిగా ఉంటుందనీ, బహుశా భాగవతంనుంచి కథకు మూలం తీసుకుంటాననీ, సర్వాంగులతో నిర్మించదలకున్నాననీ, తనకు పూర్తి సహకారాన్ని ఇస్తారనీ ఆశిస్తున్నాననీ అన్నారు. నాకు చాలా ఆనందం వేసింది. ఇంతవరకూ తీసిన పిక్చర్లనే మళ్ళీ తీస్తూ వచ్చారు. ఈసారైనా నూతనంగా, ఇంతవరకూ ప్రయత్నించనిది తీస్తే తప్పక ప్రేక్షకలోకం ఆనందిస్తుందనీ అనుకున్నాను. అదే చెప్పాను అందర్కీ. నర్మద నాలుగు పాటలు

పాడింది. పార్టీ ముగిసింది. ఇంటికి బయలుదేరాం. కారులో నర్మద మౌనంగా ఉంది.

ఆమె ఆవేదనను చూచి నేను చాలా బాధపడ్డాను. కారణం కనుక్కుందామని అనుకున్నాగానీ, ఆవిడను అలా ఒదిలేస్తేనే మంచిదని తోచింది. ఇంటికి వచ్చాక తనగదిలోకి వెళ్ళి అలానే నిద్రపోయింది. మా వెనకాలే వస్తున్న నర్మద కారు డ్రైవరు తాళం చేతులు ఇచ్చి వెళ్ళిపోయాడు. నా రూములోకివచ్చి, డైరీ రాస్తూ కూర్చున్నా. ఇంతలో ఫోను మ్రోగింది. రిసీవరు ఎత్తగానే ఆశపలికింది. "నమస్తే" అన్నా.

"నమస్తే ఏమిటండీ! మీకోసం రెండుసార్లువచ్చా. నాలుగు సార్లు ఫోన్ చేసా తెలుసునా?" అంది.

"క్షమించండి ఆశాదేవి! ఒకపార్టీ ఉంటే అక్కడకు వెళ్ళాం నేనూ నర్మదానూ. మళ్ళీ తిరిగి వచ్చేటప్పటికి ఇంత ఆలస్యం అయ్యింది"

"పార్టీ ఎన్నిగంటలకండీ?" అని అడిగింది.

"8 గంటలకు" అన్నా.

"కానీ నేను 8-15కు నర్మదగారిని రాయపురం బీచి దగ్గర చూశానే" అంది.

"మీరు అక్కడకు ఎందుకు వెళ్ళారూ?" అని అడిగా.

"నాన్నగారూ నేనూ కలిసి అక్కడ మా వర్కుషాపులో రిపేరుచేసిన కారు చెడిపోయింది అంటే వెళ్ళాం. నాన్నగారూ, మెకానిక్ కారు చూస్తుంటే నేనలా ఇసకలో తిరుగుతుంటే నర్మదగారు కనబడ్డారు" అంది.

"ఒక్కతేనా?" అన్నా.

"కాదు ఆవిడతో ఎవరో ఉన్నారు. చాలా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. డిస్టర్బ్ చేయడం ఎందుకులే అని నేను వెనక్కి తిరిగి వచ్చేసా" అంది.

"అలాగా" అన్నా ఆలోచిస్తూ.

"రేపుప్రొద్దున్నే వస్తా. సరేనా?" అంది ఆశ.

"ఏమన్నా పనిఉందా?" అన్నా.

"అబ్బే ఏమీలేదు. ఇవ్వాళంతా మిమ్మల్ని చూడలేదు. అందుకనీ" అంది. ఆమె కంఠస్వరంలోని మార్పును గుర్తించాను.

"గుడ్‌నైట్" అంది ఆశ.

"గుడ్‌నైట్" అన్నా.

ఫోనుపెట్టేసి బట్టలు మార్చుకుని నిద్రపోయా. ఉదయమే లేచి చాలాకాలం క్రితం ప్రారంభించిన కథ ముగింపు చేద్దామని కాగితాలు కలం పుచ్చుకుని రేడియో పెట్టుకుని రాయడం ప్రారంభించా. భావాలు గజిబిజిగా మనస్సులో అల్లుకు పోయినాయి. వాటిని వేటికవి విడదీద్దామని ప్రయత్నిస్తున్నా, కానీ అలా చేయలేక పోయా. నిజంగా ఒక్కొక్కప్పుడు ఏదన్నా రాద్దామనుకుని కూర్చుంటే ఆలోచనలలో కథకు కావలిసిన సమాచారం ఉన్నా కలంముందుకు కదలదు. ఒక్కొక్కసారి ఆలోచనలతో అవుసరం లేకుండానే కలం కదం తొక్కుతూ కాగితంమీద పరుగులెత్తుతుంది. ఒకే వ్యక్తిలో ఈ విభిన్న ప్రవర్తనలు ఎందు

కుంటారో? అర్థంకాదు నాకు నిజంగా నాకంతా తెలుసునని విర్రవీగడమెంత అవివేకమో నాకీ చిన్న సంఘటనతో తెలిసి వచ్చింది. ఇంతవరకూ ఎటుపోతున్నానో తెలియకుండా ఏమిచేస్తున్నానో ఆలోచించకుండా ఒక గమ్య స్థానంలేక గాలిలో పరుగులెత్తుతున్నాను. సుడిగాలిలో చిక్కుకున్న ఆకులాగాఉంది పరిస్థితి. ఈ మహా ప్రవాహం నన్నెక్కడికి ఈడుస్తుందో, నా జీవితానికి లక్ష్యం ఏమిటో, ఊహాకు అందకుండాఉంది. ఇన్నిరోజులూ నన్ను నేను మర్చిపోయి, నా గురించి ఆలోచించడం మానేసి ఈ లోకంలో కలిసి పోయాను. నిజంగా అలా చేయడంవల్లే నా కానందం కలిగిందనిపిస్తుంది. నిజంగా ఆలోచిస్తే, నేను చేస్తున్నది మంచిదేనేమో అనిపిస్తున్నది. ఒకవైపు ఆశాదేవి నన్ను ప్రేమిస్తున్నది. ఇంకో వైపు నర్మదకూడా నన్ను ప్రేమిస్తున్నదని అనుకుంటున్నా, నా జీవితానికి, నాకు కావలసింది ఏమిటో ఎంచుకోలేక బాధ పడుతున్నా. ఏం చెయ్యాలి? ఎలా బయటపడాలి ఈ సుడిగుండంలోంచి? ఎలా గడుస్తుంది నా జీవితం? నాగమ్య స్థానం ఏమిటి? ఏమీ అర్థం కావటంలేదు. ఆలోచిస్తే ఆందోళన, అలా చేయకపోతే ఆవేదన. ముందుచూస్తే నుయ్యి, వెనుకచూస్తే గొయ్యి. ఇలా సతమతమవుతున్నా నేను. ఆఖరుకి ఈ పరిస్థితిని మర్చిపోయి అందరితోపాటు జీవితాన్ని విధికి అప్పజెప్పి ఫలితాలకోసం ఎదురు చూద్దామని నిర్ణయించుకున్నా. అంతకన్నా ఏం చేయగలను. సాఫీగా జరుగుతున్న జీవితంలో సుడిగాలిలా మార్పులు వచ్చాయి, ముందు వెనుకా ఆలోచించకుండా అడుగుపెట్టాను. ఆ తర్వాత ఆలోచన, చేతులు కాలాక

ఆకులు పట్టుకున్నట్లయింది, నా పరిస్థితి. కొందరి జీవితాలు వడ్డించిన విస్తరిలాంటివి. చీకూచింతా లేకుండా గడిపేస్తారు. పెరుగుతారు. పెళ్ళిచేసుకుంటారు, పిల్లల్ని పుట్టిస్తారు. పిల్లలు చస్తే ఏడుస్తారు. తర్వాత తామూ చచ్చిపోతారు. ఇంకొందరు ఏమీ దొరకక పోయినా ఆవేదన పడకుండా దొరికిందాంతో సంతృప్తి పడతారు. విధి ఏదిస్తే అది తీసుకుంటారు. నాలాగా ఏం జరుగుతుందో అని ఆలోచించరు. నిజంగా వారెంత అదృష్టవంతులు? నేనుకూడా అలావుంటే ఎంతో బాగుండును. కాలంపరుగెత్తుతున్నది. నేనూ పరుగెత్తుతున్నా. కానీ వ్యక్తిగా కాదు. దారంలేని గాలిపటంలాగా. మనస్సు ఎదురు చెప్తున్నా సరే అందరితో పాటూ గోవిందా అంటూ పరుగెత్తుతున్నా. పిక్చరు అయిపోయింది. ఎడిటింగ్, రీరికార్డింగు నిన్ననే ముగిసాయి. నా కార్యాన్ని నేను నెరవేర్చానని తృప్తి కలిగింది. సెన్సారింగ్‌కు తేదీ నిర్ణయించుకొస్తానని రామమూర్తిగారు వెళ్ళారు. పిక్చరు పధ్నాలుగు వేలలో అయ్యింది. సెన్సారింగ్‌లో కనీసం రెండువేలన్నా తెగిపోతుంది. "పన్నెండు వేలలో తెలుగు సినిమా ఏమిటండీ?" అంటున్నాడు మురళి. నర్మదకూడా తన అసంతృప్తి వెలిబుస్తూంది. నిజంగా నేను అనుకున్నంతపని అయింది. సెన్సారింగ్‌లో వేయి అడుగులుపైనే పోయింది. ప్రభుత్వాన్ని విమర్శించడం నా ధర్మం, పనీ, కాదు కానీ, ఒక్కమాటలో చెప్పాలంటే సెన్సారింగ్ రూములో కూర్చున్న ప్రతి వ్యక్తీ తన భావాలకు ఏదితోస్తే అదే చేస్తున్నాడు. తనకు నచ్చనిది తనకు అర్థంకానిదీ ప్రేక్షకులకు కూడా అర్థం కాదనే భావంతో

విచ్చలవిడిగా కత్తిరించేస్తున్నారు. కానీ ఏంచెయ్యాలనూ? అప్ప టికీ నచ్చ చెప్పుదామని ప్రయత్నించా. తప్పును ఒప్పుకుంటే తమ తెలివితేమితనం బయటపడుతుందని కాబోలు వాళ్ళు క్రిందకు దిగిరాలేదు. ఏం చెయ్యాలో తోచటంలేదు. కవి గారిని పిలిచి, "ఏమండీ! ఏమిచేద్దాం?" అన్నా. ఆయనకూ ఆలోచన తోచలేదు. మురళి ఆఖరుకి ఒకఉపాయం చెప్పాడు. "తీరిగ్గా ఏ అజంతానో, లేక మహాబలిపురమో వెళ్ళి హీరో యిన్‌ను తీసుకువెళ్ళి, వాటి వైభవాన్ని గూర్చి ఓ ప్రబోధ గీతం ప్లేబాక్‌లో పెట్టి తీరిగ్గా త్రిప్పుదాం" అన్నాడు. నాకు నచ్చింది. ఇంతవరకూ మన ప్రాచీన శిల్పాలమీద ప్రబోధ గీతం రాయించలేదు. ఒకవేళ రాయించినా శిల్పాలను ఆ గీతాలకు అనుగుణ్యంగా వాడుకోనూలేదు. రామమూర్తి గారికి చెప్పి కవిగారూ, నేనూ, కెమేరామేన్, నర్మద, మహా బలిపురం వెళ్ళాం నాలుగు రోజులలో పని అయిపోయింది. తిరిగి వచ్చాక కవిగారి ప్రబోధ గీతం వచ్చేటప్పటికి ఆలస్యం అయ్యింది. దానికితోడు మురళి మరీ ఆలస్యం చేసాడు. ఇన్ని సమకూర్చేటప్పటికి కెమేరా దొరకలేదు. పోనీ సౌండు స్టూడియో ఉపయోగిద్దామా అంటే పదిహేనురోజుల వరకూ కాళీరాలేదు. ఈ రోజులన్నీ ఎలా గడపాలా అని ఆలోచనతో బాధపడసాగాను. ఇంతలో పబ్లిసిటీ అసిస్టెంట్ వచ్చి, స్టిల్సు కావాలండీ అన్నాడు. ఇంకేం దొరికావ్ బ్రదర్ అనుకుని, రామమూర్తిగారితో మాట్లాడి, పబ్లిసిటీ ప్రారంభించాం. మాతో సహకరించారు డిస్ట్రిబ్యూటర్స్. తేదీ వెల్లడి చేయ కుండా, రోజుకొకవ్యక్తి విలువమీద అతని నటనమీదకాని,

టెక్నీషియన్ అయితే అతని నైపుణ్యం మీద పబ్లిసిటీ ఇవ్వ నారంభించాం. అప్పుడే మార్చినెల ప్రారంభ మయ్యింది. రవి తన ఉద్యోగాన్ని కొంచెం కొంచెం చవిచూస్తున్నాడు. అప్పుడే స్టూడియోనుంచి యింటికి వచ్చాను. కారులో కూర్చున్నంతసేపూ హాయిగాఉంది. క్రిందికిదిగాక ఒకటే చెమట. గాలి స్తంభించిపోయింది. గదిలోకివెళ్ళి ఫానువేసు కున్నా. కానీ వేడిగాలి రివ్వుమంటూ పలకరించే సరికి గదిలో ఉండబుద్ధి వేయలేదు. డ్రాయింగురూములోకివచ్చి తొట్టిలో ఉన్న చేపలకి మేతవేసి కూర్చున్నా. ఏమీ తోచటంలేదు. నర్మద స్టూడియోలో ఉందీ లేందీ తెలియదు. స్నానం చేసి బయటకు పోదామనుకుని, సోఫాలో అలా కూర్చున్నా. నిద్ర పట్టింది. అంతా కలతనిద్ర. లోలోపల అణిగియున్న భావాలు బయట పడనారంభించాయి ఏదో తెలియని ఊహలు, ఊహ కందని, శేషప్రశ్నలు, నిర్వచింపలేని అనుభూతులు ఇలా కొట్టుకు లాడాను, ఓ అరగంటసేపు. గడియారం అరగంట కొట్టింది. నాలుగున్నర అయ్యింది. లేచి స్నానంచేసి, సిల్కు లాల్చి పైజమా వేసుకొని, బయలుదేరా బయటకు. నెమ్మదిగా నడుస్తున్నా. ఎక్కడికో తెలియదు. ఏం చెయ్యాలో తెలియదు. ఒక యంత్రంలాగా నడుస్తున్నా. మొదటులో ఏవిధమైన అనుభూతులులేవు. పరిసరాలను మాత్రం గమనిస్తున్నా అంతే. రోడ్డుమీదకార్లు వెళుతున్నాయి వేగంగా. అందులో తెలిసినవారూ ఉన్నారు. తెలియనివారు ఉన్నారు. చిన్నప్పుడు కారున్నవారినిచూస్తే అసూయ కలిగేది. ఇప్పుడూ నిర్వచింపలేని ఏదోభావం కలుగుతుంది. నాకూ

కారండి గదా అనే సంతృప్తి మాత్రం నాకులేదు. చెమటతో నల్లబడిన ముఖాన్ని చెమటతో నల్లబడిన జేబురుమాలుతో తుడుచుకుంటూ ఎదురుపడుతున్నారు శ్రామికులు, సామాన్య మధ్య సంసారులు. చెమటవల్ల పౌడరు కరిగిపోయి చారలుపడిన ముఖాలతో ఎదురుపడుతున్నారు, ఆఫీసులోపనిచేసే టైపిస్టులు, కాలేజీనుంచి తిరిగి వచ్చే గరల్సు. గారబట్టిన పళ్ళు నవ్వుతూ, సున్నంతో తెల్లబడిన వేళ్ళను నోట్లో పెట్టుకుని చప్పరించి లాంప్ పోస్టుమీద తమ్మని ఊస్తూ పెద్దదైన బొజ్జనుమోస్తూ, జారిపోతున్న గూడ కట్టును సర్దుకుంటూ నడుస్తున్నారు అరవ సోదరులు. ఇవీ నేను గమనించింది. బస్సెక్కి బీచికి చేరా. నిర్మానుష్య ప్రదేశంలోకివెళ్ళి కూర్చున్నా. సిగరెట్టు వెలిగించి సముద్రంలోకి, ఇంకా ఆ పైకి, శూన్యంలోకి చూస్తూ కూర్చున్నా. సూర్యుడు ఎర్రగా అందంగా అస్తమిస్తున్నాడు. అంతవరకూ కాంతి విహీనంగాఉన్న చందమామ వెలుగును పుంజుకుని పునర్జీవుడవుతున్నాడు. పాలపుంతకోసం వెతికా. కనపడలేదు. నిశ్చలంగాఉంది సముద్రం. ఇంకా ఉప్పొంగే సమయం రాలేదు. కొంచెం దూరం వెనక్కి జరిగి మగతగా కన్నుమూసా. అలా చాలాసేపు పడుకున్నా. సముద్రపు కెరటం వచ్చి కాళ్ళను తడిపేవరకూ నాకు మెలకువరాలేదు. లేచి చూసేసరికి పైన పండువెన్నెల. నా చుట్టూ ప్రశాంతమైన ప్రకృతి. వీనులకు విందుగా అలలధ్వని. తన్మయత్వం కలిగిందినాలో. నాలో ఏదో క్రొత్త ఉత్సాహం కలిగించి. టైము చూసేసరికి 9 గంటలయ్యింది. లేచి ఇంటికి బయలు

చేరా. మధ్యలో మౌంటు రోడ్డులో మురళి కనపడ్డాడు. ఇద్దరమూ కలిసి స్టూడియోకు వెళ్ళాం. ఆరోజు మురళి ఇంకో క్రొత్త పిక్చరుకు కాంట్రాక్టు రాశాడు. ఉత్సాహంగా ఉన్నాడు, "భాయీ! నువ్వు ఛాన్సు ఇచ్చి ఉండకపోతే ఇంకెంత కాలం అసిస్టెంటుగా ఉండేవాడినో!" అన్నాడు అల్ప సంతోషి. కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడేస్తాడు. కోపాన్ని ఆపుకోలేడు. ఇటువంటివాళ్ళకీ ప్రపంచంలో విలువ లేదు. నిజమే. నిజానికి పచ్చిమంచినీళ్ళు కూడా పుట్టవు. స్టూడియోకు వెళ్ళాక తమిళ ప్రొడ్యూసరు నర్మదను తిడుతున్నాడు.

"ఏమిటండీ?" అని అడిగా.

"చూడప్పా! ఆరుమణికి కాల్‌షీట్ దా ఇరకు. ఇంత వరకూ పత్తాలేదు మీస్టార్. ఫోన్‌చేస్తే ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతాది. సగం పిక్చరయింది. ఇప్పుడిలా ముంచితే నాకెట్లా?" అన్నాడు.

నాకు కోపం వచ్చింది నర్మదమీద. మురళీని స్టూడియోలోనేఉంచి ప్రొడ్యూసరుగారి కారుమీద ఇంటికి వచ్చా. నర్మద గదిలోఉంది. తలుపు తట్టా. లోపల గందర గోళంగా ఉంది. తలుపు మళ్ళీ తట్టా. నర్మద తలుపు తీయలేదు. అయ్యరు వచ్చి, "నర్మదగారికి ఒంట్లో బాగుండలేదండీ" అన్నాడు.

నేను ముదలియారుగారి కారును త్రిప్పి పంపేసా. స్నానంచేసి భోజనం దగ్గిర కూర్చున్నప్పుడు నర్మద గదిలోంచి ఏడుస్తున్న చప్పుడు వినపడితే కంచం వదిలి పరిగెత్తా.

దారిలో అయ్యారు అడ్డుపడ్డారు. వాడిని అవతలికి తోసి నర్మద గది దగ్గరకు వచ్చి తలుపు కొట్టా. ఇంతలో నర్మద నవ్వుతున్న ధ్వని వినపడింది. నాకు ఏం చెయ్యాలో తోచలేదు. తలుపు కొట్టడం మొదలు పెట్టా. రాజ్యలక్ష్మి వచ్చి, "మీరు నర్మదగారిని ఇప్పుడు చూడటం అంతమంచిది కాదు" అన్నది.

"మీ సలహాలు అక్కర్లేదు, దయచేసి వెళ్ళండి ఇక్కడినుంచి" అన్నా.

"శాంతంగా ఆలోచించండి. ఆమె మీరు చూడ కూడనటువంటి పరిస్థితులలో ఉండి ఉండవచ్చు. దయచేసి నాతోరండి" అంటూ! చేయిపుచ్చుకుని లాక్కుని వెళ్ళిపోయింది డ్రాయింగు రూములోకి.

నేను అశక్తుడిని అయిపోయా. నాలోని కోపమంతా చల్లారిపోయింది. ఆవేశం అణగిపోయింది. దానిలోటు వెలితిగా కనిపిస్తున్నది నా మెదడులో. "ఇదిగో కాఫీ త్రాగండి" అంది రాజ్యలక్ష్మి నా కెదురుగా కూర్చుని. కాఫీ కప్పు అందుకుని నిశ్శబ్దంగా త్రాగా. కాఫీ త్రాగాక నాకు చెమట పట్టనారంభించింది. రాజ్యలక్ష్మి ఫానువేసి, "ఇప్పుడు తగ్గిందా మీ ఆవేశం?" అని అడిగింది సౌమ్యంగా.

"తగ్గింది" ,అన్నా సిగరెట్ వెలిగించి.

కాసేపు ఇద్దరం మాట్లాడకుండా కూర్చున్నాం.

తలెత్తిచూచా. రాజ్యలక్ష్మి సోఫాలో అలానే ఒరిగి నిద్రపోతున్నది. లేచి నా పడక గదిలోకి వెళ్ళి రగ్గుతెచ్చి ఆమెమీద కప్పి బయటకు వెళ్ళా. బయటంతా వెన్నెల.

మెదడు ఆలోచించాలంది. తిన్నగా సెంట్రలుకెళ్లా. అంతా సందడిగాఉంది. తూర్పు వాళ్ళలాగుంది. చుట్టలు త్రాగుతూ, విసురుగా ప్రతిమాటకూ దీర్ఘం తీస్తూ యాసగా మాట్లాడు తున్నారు. ప్రక్కన చంటిపిల్లలు అమాయకంగా స్టేషను దీపాలు చూస్తూ ఆడుకుంటున్నారు. అలానే సిగరెట్టు కాల్చు కుంటూ నిలబడ్డా. అంత గందరగోళంగాఉన్నా, నా మెదడు ఆలోచించసాగింది. నర్మద చాలా మారిపోతోంది. ఎందుకు? దేనివల్ల? ఎవరు కారణం? మధ్య మధ్య, నర్మదలో అక స్మాత్తు పరిణామం. ఆరోజు డిన్నరుకు ఆలస్యంగా రావడం ఆశ, నర్మద ఎవరితోనో మాట్లాడుతుంటే చూడటం. ఆ వ్యక్తికీ నర్మదకూ ఏం సంబంధం? నర్మద ప్రవర్తన అతని మీద ఆధారపడివుందా? ఎవరతనూ? ఈ ప్రశ్నలు నా మెద డులో గిర్రున తిరుగసాగాయి. నర్మదతో ఇంత కాలంగా తిరుగుతున్నాను. ఒకే కప్పుక్రింద నివసిస్తున్నాను. ఆమెను గురించీ నాకేమీ తెలియలేదు. ఎంతో తెలుసు అనుకున్న హృదయం అవుసరంవస్తే నిజం తెలుసుకుని గిలగిలలాడి పోతుంది. పరీక్షలో బ్రహ్మాండంగా రాద్దామనుకుని "ఎ" నుంచీ "జడ్" వరకూ బట్టీ పట్టుకు వెళ్ళిన కుర్రాడు పరీక్ష రాస్తూ సగంలో ఆన్సరు మరిచిపోయి గొల్లున ఏడుస్తాడు. అలానేఉంది నా పరిస్థితి. ఏమైనాసరే రేపటినుంచి నర్మదను అర్థం చేసుకుందాం అనుకుని ఇంటికి తిరుగు ముఖంపట్టా. బస్సులు లేవు, ఎలక్ట్రిక్ ట్రైనులు అంతకంటేలేవు. రిక్షా పిలిచి ఎక్కి కూర్చున్నా. ఇంటికి చేరేటప్పటికి నాలుగు అయ్యింది. గేటు దగ్గిర గూర్ఖా మస్తుగా నిద్రపోతున్నాడు.

విచిత్రంగాలేదూ! వీడేదో కాపలా కాస్తాడని వాడిమీద పూర్తి భరోసాపెట్టుకుని నిద్రపోతాం. వీడిదారివీడు నిద్ర పోతాడు. ఇంకో వ్యక్తిని నమ్మలేక ఒక వ్యక్తిని నమ్ముకుని, నిశ్చింతగా మర్చిపోతాం మనల్ని. ఈ విభిన్న దృక్పథాలు ఎలా ఇమిడినాయో మనలోపల? నిద్రపోదామని ప్రయత్ని స్తున్నా నిద్ర రావటంలేదు. హృదయంలో బడబానలంలా రగిలే ఆవేదన భరించలేక కృత్రిమ చైతన్యం కలిగించుకుని నిద్రను సృష్టించుకో బోతున్నా నేను. నిజంగా నా బ్రతుకు అంతా కృత్రిమమే-కాదు-చుట్టూ ఉన్నది కృత్రిమమైన పరి స్థితులు. దాంట్లో ఆడుతున్న నీడలు మాత్రమే కృత్రిమం, వాటితాలూకు మానవులు నిష్కల్మష హృదయులు. పరిస్థి తులు తెచ్చిన ఆవేదనా ఉధృతంలో, మనో దౌర్బల్యం పెరిగిపోయి నిరాశతో మనిషి మతిచెడ గొట్టుకునే పరిస్థితులు లేకపోలేదు. కానీ ఆ వ్యక్తి తన జీవితంలో ఉన్న నిర్లక్ష్యం, నిగ్రహశక్తి, జీర్ణించుకుపోయి ఉన్న వ్యథలు దూరం చేసు కుని తామరాకుమీది నీటిబొట్టులా గడిపేస్తాడు. ఇదేలా గుంది? వ్యక్తిలో వైరాగ్యం ప్రబలడమంటే, ఇది ఒకరక మైన పిచ్చి ఎందుకు కాకూడదూ! ఏమిటో ఈ ఆలోచనలు? ఉదయం నిద్రలేచేటప్పటికి 9 అయ్యింది. ఒళ్ళంతా అదో మాదిరిగా ఉంది. తలనొప్పి దంచేస్తున్నది. త్వరగా పనులన్నీ ముగించుకొని, రెండు ఆస్ప్రిన్ వేసుకుని, రూములోకి అయ్యారు తెచ్చిన కాఫీ త్రాగి, బట్టలు వేసుకుని, డ్రాయింగు రూము లోకి వచ్చా ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

సోఫాలు తుడుస్తున్న తోటమాలితో, "అమ్మగారు ఏరి?" అని అడిగా.

"బొంబాయి ఎళ్ళారండీ" అన్నాడు.

"ఎప్పుడూ?" అని అడిగా ఈ అకస్మాత్తు ప్రయాణానికి ఆశ్చర్య పోతూ.

"తెల్లవారేనండీ, నాలుగు కొడ్తారు అప్పుడండీ"

"డ్రైవరును కేకేయి" అన్నా. వాడు వెళ్ళిపోయాడు.

మురళి స్టూడియోకు వచ్చాడేమో అని ఫోన్ చేసా.

నాలుగవ ఫ్లోరులో ఉన్నాడని కబురు చెప్పారు.

అయితే మురళి క్రొత్త పిక్చరు ప్రారంభ మయిందన మాట అనుకుని రిసీవరు పెట్టేసరికి డ్రైవరువచ్చి, "పిలిచారట" అన్నాడు.

"అమ్మ నాలుగు గంటలకు వెళ్ళిందట ఎక్కడికి?" అన్నా.

"ప్లేన్‌లో వెళ్ళారు బొంబాయి. రాత్రి వైకౌంటు ఆలశ్యంగా వెళ్ళిందండీ" అన్నాడు.

"షూటింగ్‌కా?" అన్నా.

"అవునండీ" అన్నాడు.

"సరే కారును బయటకు తియ్యి, స్టూడియోకి వెళ్లాలి" అన్నా.

"అలాగేనండీ" అని వెళ్ళిపోయాడు

ఆశకు ఫోన్ చేసి, "స్టూడియోకి వెళ్దాం వస్తారా?" అని అడిగా.

"ఓ.కె" అని ఆవిడన్నాక, నేనుబయటకు వెళ్ళిపోయా.

దారిలో ఆశను ఎక్కించుకొని స్టూడియోకు వెళ్ళాం.

మురళి దగ్గిరకు వెళ్ళా. బ్రహ్మాండంగా ఒక డ్రాయింగ్ రూము అలంకరించేస్తున్నాడు. అందమైన విగ్రహాలు ద్వారం దగ్గర అమరుస్తున్నాడు. నన్నుచూసి, "ఏంగురూ! మోల్డింగ్ బాగా కుదిరిందికదూ?" అన్నాడు.

"బ్రహ్మాండంగాఉంది" అన్నా.

"హల్లో! నమస్తే ఆశాదేవి" అన్నాడు ఆశనుచూచి.

"నమస్తే. అక్కడ కిటికీ ఇంకా పెట్టలేదేమిటండీ?" అని అడిగింది.

"థ్యాంక్యూ గుర్తు చేసారు. దాని సంగతే మరిచి పోయా. ఓయి ఏళుమళ్ళే అక్కడ ఫౌంటెన్ ఫ్రేము పెట్ట లేదేమయ్యా. అన్నిటికి, "సాదం"లాగా ఉంటే ఎట్లా అయ్యరూ? క్విక్‌గా తీసుకురా" అన్నాడు మురళి.

ఇదోవర్రా "అంటూ ఫౌంటెన్ ఫ్రేమ్ పెట్టాడు. దాన్ని బిగించి మురళి, "ఇప్పుడు చెప్పండి ఆశాదేవీ ఏం లోపించిందో. ఆ ఫౌంటెన్ ఫ్రేమ్ బయట గార్డెన్‌లోది. లోపలికి కనపడేదన్నమాట. రేడియో ఫ్రేమ్ పెద్దది అయిం దేమో. అని అనుమానం" అన్నాడు.

"అక్కేలేదు. డ్రాయింగ్ రూము కనుక ఆ మాత్రం రేడియో ఉండాలి" అంది ఆశ.

"చాలా థ్యాంక్స్ అండీ" అన్నాడు మురళి.

"బ్రదర్! ఈ సెట్‌మీద పని అయిపోయినట్టేనా?" అని అడిగా.

"ఓ, ఈ సెట్ మీద ఓ వారంరోజులు పని ఉంటుం దట. తరువాత దానికికూడా అన్ని ప్లానులు, స్కెచ్ లు గీసేసా రాత్రి కూర్చుని. ఏది ఏమైనా నాలుగు రోజుల వరకు మనకు ఎక్కడలేని తీరుబడి" అన్నాడు ఉత్సాహంగా.

"అయితే సాయంత్రం ఇంటికి వస్తా" అన్నా.

"ఏం, ఏమన్నా అవుసరమైన పనా?" అని అడిగాడు.

"అబ్బే అదేంకాదు. స్వవిషయాలు" అన్నా కన్ను గీటి.

ఆశ్చర్య పోయాడు మురళి, "ఓ.కె" అని.

"ఇక వెళ్దామా ఆశాదేవీ?" అన్నా.

"పదండి" అంది.

"ఉంటానండీ చీఫ్ఎడ్వైజర్ గారూ" అన్నాడు మురళి.

"ఏం లాభం జీతం బత్తెం లేని ఉద్యోగం" అంది ఆశ.

ఆమాటకు అంతా నవ్వాం.

బయటకు వచ్చాక, "ఎక్కడికి వెళ్దాం?" అని అడిగా ఆశాదేవిని.

"మీ ఇష్టం" అందావిడ.

"అయితే పదండి" అన్నా. ఆవిడ కారులోకూర్చుంది.

స్టూడియో బయటకు వచ్చాక, "మనం ఎక్కడకు వెళ్తున్నాం?" అని అడిగింది.

"మీ యింటికి. మిమ్మల్ని ఇంటివద్ద దింపి నేను పోతాను" అన్నా.

"ఈ మాత్రానికేనా నన్ను పిలిచారు!" అని అడిగింది ఆశ.

ఆవిడకు ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. ఇద్దరమూ మరి మాట్లాడుకోలేదు. ఆవిడ దిగుతూ, "మీకు కోపం తెప్పించినట్లున్నాను క్షమించండి" అంది.

"నాకసలు కోపం రాలేదు. అటువంటప్పుడు మీరు క్షమాపణ కోరుకోడం, నేను క్షమించడం ప్రసక్తే రాదు" అంటూ కారు స్టార్టు చేసా.

ఇంటికి చేరేటప్పటికి ఎండ దంచేస్తున్నది.

లోపలికి వెళ్ళి స్నానంచేసి, భోజనంచేసి నిద్రపోయా. సాయంత్రం అయిదు అయ్యింది లేచేటప్పటికి.

మొహం కడుక్కొని కాఫీ త్రాగి సిగరెట్ వెలిగించుకుని కూర్చున్నా. నీరెండ కిటికీలోంచి పడుతున్నది. ధూళి ఆ ఎండలో చేస్తున్న నాట్యం చూస్తూ కూర్చున్నా. ఆలోచిస్తున్న కొద్దీ ఆందోళన హెచ్చవుతున్నది. బద్ధకస్తుని మెదడు దయ్యాపు ఆలోచనలకు పుట్టినిల్లు అంటారు ఇదే గామోసు. ఇంతలో ఫోను మోగింది. రిసీవరు ఎత్తేటప్పటికి మురళి.

"వస్తున్నా" అంటూ రిసీవరు పెట్టేసి, బట్టలు వేసుకుని మురళి ఇంటికి వెళ్ళా. కోడింబాకంకు వెళ్ళే దారిలోఉంది. పాక అది. పాకఅయినా చాలాఅందంగా అలంకరించాడతను. కళాకారుడి స్వప్నం చూస్తున్నట్లు ఉంటుంది, అతని ఇల్లును, ఇంటిలో ఉంచే అలంకరణలను చూస్తుంటే. మురళి భార్య కాఫీ తెచ్చి ఇచ్చింది.

కాఫీ తాగి ఇద్దరము బయటకు వెళ్ళాం. అలా ఊరు బయటకు వెళ్ళాక, కారాపి, దిగాను. అతనుదిగాడు. ఇద్దరమూ ఒక చెట్టుక్రింద రుమాళ్ళు పరచి కూర్చున్నాం.

ప్రసంగం ఎలా ప్రారంభించాలో తెలియక సతమతమవుతుంటే,"ప్రొద్దున్న ఏదో విషయం మాట్లాడాలి అన్నావు" అని అడిగాడు మురళి చెట్టుకు ఆనుకుంటూ.

"అవును. నేను చెప్పబోయేది మనిద్దరిలోనే ఉండిపోవాలి. ఎటువంటి పరిస్థితులలోను ఇతరులకు తెలియనివ్వను అని ప్రామిస్ చెయ్యి" అని అడిగా.

"ఓ. కే" అన్నాడు.

"నీవెంతకాలంనుంచీ ఈ పరిశ్రమలో ఉన్నావు?" అని అడిగా.

"ఆరేళ్ళనుంచీ" అని అన్నాడు.

"సరే అయితే పరిశ్రమలోని వ్యక్తులయొక్క వ్యక్తిగత జీవితాలు గురించి నీకు తెలుసు అనుకుంటా?" అని అడిగా.

"అందరిగురించీ తెలుసుకోడానికి నేనేమన్నా చిత్రగుప్తుడ్నా ఏమిటి?" అన్నాడు మురళి.

"పోనీ తెలుసుకో గలవా?" అన్నా.

"ప్రయత్నిస్తా. ఏం ఎవరిమీద కలిగింది మీకే ఇంటరెస్టు?" అన్నాడు మురళి.

"నర్మదమీద" అన్నా.

"నమ్మలేకుండా ఉన్నా" అన్నాడు మురళి.

"నిజమే, కాని నర్మద గురించి తెలుసుకోవాలి అనే ఉత్కంఠ నాలో ఎక్కువయ్యింది ఈమధ్య" అన్నా.

"సరే, అయితే ప్రయత్నిస్తా" అన్నాడు.

వివరాలు గురించి నన్ను మురళి అడగనందుకు మురళికి నా మనస్సులోనే ధన్యవాదాలు అర్పించా.

"ఇక లేద్దామా?" అన్నాడు మురళి.

"సరేపద పోదాం" అంటూ లేచా.

ఆరాత్రి గడిచిపోయింది. నాలుగురోజులైనా నర్మద బొంబాయినుంచి రాలేదు.

బొంబాయికి కాల్ బుక్ చేసి ఆరోజున ఇంట్లోనే ఉండిపోయా.

మధ్యాహ్నం వేళకు కనక్షన్ దొరికింది. తీరా చూస్తే షూటింగ్ నిన్ననే అయిపోయిందట నర్మద ఎక్కడుందీ తెలియదట. నాకేం తోచటంలేదు. భోజనంచేసి కూర్చున్నా. నిరాశా, నిస్పృహా నాలో పెనరేగింది. ఒక్కొక్కసారి నాలో ఇవి ప్రవేశించినపుడు, నిర్జీవంగా ఉన్న నా శక్తికి ప్రాణం పోయాలని తహతహ లాడుతాను. ఆఖరుకు ఏ చిన్నపని కనపడినా, ఎంతో గొప్పగా చేయాలని, ఏ చిన్న సంభాషణైనా ఎడతెగని సంవాదంక్రింద మార్చాలని ప్రయత్నిస్తా. కాలం పరిగెత్తటం లేదని విసుగుకోడం, సిగరెట్లమీద సిగరెట్లు కాల్చడంక్రింద మారుతుంది నా పరిస్థితి. ఎందుకింత అనవసరంగా బాధపడుతున్నాననుకొని, స్నానంచేసి, బయటకు వెళ్ళిపోయా. ఆ మరుసటిరోజు ఉదయం స్టూడియోకి వెళ్లి పనులన్నీ చూసుకుని మురళికోసం వెతికా. ఎక్కడా కని

పించలేదు. స్టూడియోనుంచే ఆశాదేవికి ఫోన్ చేసా. ఇంట్లో లేదట! ఎక్కడికి వెళ్లింది చెప్మా అనుకుంటూ ఇంటికిచేరా. ఇంట్లో అడుగు పెట్టిందగ్గరనుంచీ హృదయంలో ఏదో నిర్వ చింపలేని అనుభూతి కలిగింది. ఏదో తెలియని ఆందోళన, కాదు, ఆవేదన కలిగింది. అందరిజీవితాల్లోనూ కలుగుతుం టాయికదూ ఇటువంటి విచిత్ర అనుభూతులు! నాకానందా న్నిచ్చే చోటులో కూర్చున్నా. ఎదురుగా ఎక్వేరియమ్, ప్రక్కన రేడియోగ్రామ్ సంగీతం, చేతిలో చక్కని నవల రికార్డులు అయిపోయాయి.

రేడియోగ్రామ్ ఆఫ్ చేసి. రేడియో పెట్టా, తెలియని స్టేషను నుంచి సంగీతం వినవచ్చింది. అలవాటు ప్రకారం టేప్ రికార్డరు ఆన్ చేసి, దాంట్లో లీనమయ్యా. ఇలా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలియదు.

టెలిఫోన్ బెల్ నన్ను వాస్తవికతలోకి లాగుకొచ్చింది. రిసీవరు ఎత్తా. మురళి అవతలివైపు మాట్లాడు తున్నాడు.

"అదేం బ్రదర్, అరగంటనుంచి రింగ్ చేస్తున్నా నువ్వు ఎక్కడకు వెళ్ళావు?" అని అడిగాడు.

"నిద్రపోతున్నా కానీ ఏమయ్యింది ఆ గొడవ?" అని అడిగా.

"మురళి ఏం చెబుతాడు? నన్ను అడిగితే నేనే చెబు తాగా" అంది నర్మద నామీద చేయివేసి, ఫోను డిస్కనెక్ట్ చేస్తూ.

"హల్లో ఎప్పుడూ రాక?" అన్నా.

# 6

నిశ్శబ్దంగా ఉన్న ప్రకృతిలో ఫిరంగి గుండువేస్తే ఎలా ఉంటుంది? ఆ భయంకర శబ్దం ప్రకృతి ప్రశాంతతను బ్రద్దలు కొడుతున్నట్లు, ఆ బాధకు ప్రకృతి విలపిస్తున్నట్లు, అనిపిస్తుంది కదూ? ఆ అనిశ్చలత, ఆ భయంకర వాతావరణం నా భావాలలో నా మనస్సులో ఎవరో సుత్తిపెట్టి కొట్టి మరీ గుర్తుకు తెస్తున్నట్లుంది. ఈ విచిత్ర పరిస్థితిలో ఉన్న నా మనస్సును నా అధీనంలోకి తీసుకురావడానికి ప్రయత్నించా నాలుగురోజులు. కానీ ఈ పరిస్థితిలోకి నన్నీడ్చిన నర్మద నిశ్చలంగా, నిర్విచారంగా స్టూడియోలకు వెళ్తూవస్తూఉంది. ఆమెకు సమాధానం ఇవ్వాల్సిన గడువు దగ్గరకొస్తున్నకొద్దీ నాలో అనిశ్చలత పెరగసాగింది. ఈలోపుగా ఆశాదేవి, రోజుకు నాలుగుసార్లు నాతో మాట్లాడటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నది. ఆవిడ ఏదో మాట్లాడటం, దానికి సంబంధం లేని సమాధానాలు నేనివ్వడం, ఆవిడ విసుగెత్తి వెళ్ళిపోవడం, ఇలా రోజూ జరుగుతున్నది. ఆవిడబాధ నాకర్థంకాదు. అర్థం చేసుకోడానికి మెదడులో చోటులేదు. సర్వవేళలా నర్మద వాక్యాలు రింగుమంటూ మ్రోగుతున్నాయి.

"చూడబ్బాయి! నేను నాకథ నీకు చెప్పాను. ఒకవిధంగా నా యావత్ జీవితం నీ చేతులలో పెట్టాను. ఇంక ఎలా ముగిస్తావో అనే ఉత్కంఠ నాలో కలుగకుండా చేసుకొనే బాధ్యత నాది. నా జీవితం నీ చేతులలో పెట్టాను అనీ,

నేను అశక్తురాలను అనీ, నీలో అభిప్రాయం కలుగకుండా చూసుకునే బాధ్యత నీది. వారంరోజులు నీకు చాలనుకుంటా" అంది.

నవ్వుతూ వెళ్ళిపోయింది. నిత్య జీవితానికి అతీతంగా లోపల నిరంతరం ప్రవహించే మరో చైతన్య ప్రవాహాన్ని తెలుసుకోడం నాకు సాధ్యంకాదు. లోపల అగ్ని పర్వతం ఉన్నా, లావా పైకి ఉబుకుతున్నా, నిండుకుండలా వెళ్ళిపోయింది నర్మద. ఇంతకాలం నేను నర్మదను అర్థంచేసుకున్నా అనే భ్రమలో పడిఉన్నా. ఈనాడు తెలిసింది. నా అమాయకత ఎంతవరకూ నిజమో. ఆత్మ బంధువు మరణిస్తే ఒక్కసారి హృదయంలో నిర్లిప్తత, శూన్య భావం హృదికి ఎలా వ్యథ నిస్తుందో అలానే నర్మద మాటలు నాకా భావం కలుగ చేసాయి. నాలుగురోజులక్రితం వరకూ నా వ్యక్తిత్వాన్ని గురించి, నా ప్రవర్తనగురించి ఆలోచించడం సరిపోయింది. ఈనాడు అకస్మాత్తుగా ఇంకోవ్యక్తిగురించి ఆలోచించడం ఆవ్యక్తి జీవితపు చివరి అధ్యాయం నా చేతుల్లోఉంది అనే భావం నాలోకల్గి నన్ను నిరుపాయుడ్నిగా చేయడం, తలుచుకుంటూంటే నా హృదయం చెట్టునున్న పండుటాకులా రెపరెపలాడుతున్నాది. ఏ క్షణంలో ఊడిపోతుందో తెలియదు.

ఈ సమస్యను ఎలా పరిష్కరించడం? ఎలా తప్పుకోడం? పరిసరాలు పరికించా. అంతర్గత వాతావరణంలా బయటకూడా చీకటిగాఉంది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. టేబుల్ లైట్ దగ్గిర పెద్దకవరుంది. దస్తూరిని బట్టి ఆశ రాసిం

దని గ్రహించా. లాభంలేదు ఎక్కడికైనా పారిపోవాలి. ఉద్రేకం వచ్చింది. గబగబ బయటకు వచ్చా. కారెక్కా. "మనస్సు మనస్సులో లేనప్పుడు వ్యక్తియొక్క నిజమైన వ్యక్తిత్వం బయట పడుతుంది సుమా!" అన్న రాజేశ్వరి వాక్యాలు ఈనాడు గుర్తుకు వస్తున్నవి. ఆ వాక్యాలన్న రాజేశ్వరి ఈనాడు లేదు, కనీసం సలహా అన్నా తీసుకుందా మంటే. అలానే నిద్రపోయా. నాలుగు రోజులనుంచీ లభ్యం కాని ఆత్మశాంతి ఆ నాలుగు గంటలలో లభ్యమయింది. లేచి కూర్చున్నా. ఎదురుగా సముద్రపు అలలమీద భాస్కరుని కిరణాల తాండవం, అలల రొదతో లయకలుపుతున్న చల్లటి గాలి, బంగారు రంగులో ఈదుకుంటూ వెళ్తున్న నావలు. ఊపిరి గట్టిగా తీసుకుని ఒక్కసారి వదలిపెట్టి లేచి కూర్చున్నా. సిగరెట్టు కాల్చాలనిపించింది. జేబులు తడుముకున్నా. అయి పోయాయి. లేచి ఇసక దులుపుకొని ఇంటికి వెళ్ళిపోయా. నా దుమ్ముకొట్టుకున్న శరీరం, నల్లగాఉన్న నా బట్టలు, రేగిన తల చూచి ఇంట్లో పనివాళ్ళు గుసగుసలు మొదలు పెట్టారు. నాకు కోపం రాలేదు. నిజమే ప్రకృతితో ఓడిపోయిన వ్యక్తికి ఇంకొకరిమీద కోపం చూపించగల స్తోమత ఎక్కడిదీ!

స్నానంచేసి, గదిలోకివెళ్ళి నిద్రపోయా. సాయంత్రం మూడు అయ్యింది. అప్పుడులేచి, అయ్యరుతెచ్చిన కాఫీ త్రాగి, ఆశకు ఫోనుచేసి, నేను వస్తున్నట్లు చెప్పా. ఆమె సరే అంది. ఈ నాలుగు రోజులూ తన ఆకారంతో, తనలో దాచుకున్న విషంతో, నన్నెక్కిరించి, నను హేళనచేసి, కుంటుపడిన నా ఆత్మాభిమానాన్ని వేలెత్తి చూపిస్తున్న

టేప్ రికార్డర్ని కారులో పెట్టుకుని, ఆశను మౌంట్ రోడ్డులో పికప్ చేసుకుని, మెరినాకు దూరంగా సరుకుతోటలుండే చోటికి వెళ్ళి ఆగా. కారులో ఉన్నంతసేపూ ఎవ్వరమూ మాట్లాడలేదు.

"కుర్చుందాం పదండి"-అన్నా క్రిందకు దిగి

నన్ను అనుసరించిందామె.

ఎదురుగా ఉన్న రెండు సరుకుచెట్ల నానుకుని కూర్చున్నాం. అస్తమిస్తున్న రవి అరుణకాంతిలో అలలు ఎర్రటికాంతు లీనుతూ సాగిపోతున్నాయి నా గుండెల్లో మంటల్లా.

"ఏమిటీ ఆలోచిస్తున్నారూ"? అని అడిగింది ఆశా దేవి.

ఆమాటతో నేవచ్చిన సంగతి గుర్తొచ్చింది.

"ఏం లేదు ఆశాదేవీ! నాలుగురోజులక్రితం ఒక సంఘటన జరిగింది-అది మీతో చెప్పుదామని" అన్నా.

"చెప్పండి" అంది ఆశ భారంగా నిట్టూర్పు విడుస్తూ

అదిగమనించిన నా హృదయం గతుక్కుమంది. చెప్పనా వద్దా అనే మీమాంసలో పడింది నా వ్యవహారం.

"ఉపోద్ఘాతం లేకుండా ప్రారంభించండి" అంది ఆశ.

"నర్మదకూ నాకూఉన్నటువంటి పరిచయపు పరిస్థితి మీకు తెలుసు. పదిరోజుల క్రితం నా గతజీవితాన్ని పర్యావలోకించా, కానీ నర్మద జీవితంతో ముడిపడిన జీవితం, ఆమె

చరిత్ర దగ్గిరకొచ్చేసరికి ఖాళీగా కనపడింది. ఆ ఖాళీ పూర్తి చేద్దామనుకునే లోపలే, నర్మద తన జీవితాన్ని, తనే విప్పి చెప్పింది. అది అనుకోకుండా టేప్ రికార్డు అయ్యింది. కారులో ఉంది తెస్తా ఉండండి"–అంటూ లేచా.

"అక్కర్లేదు మీరే చెప్పండి" అంది ఆశ.

"నే చెప్తే కొన్ని కొన్ని విషయాలు మరిచిపోవచ్చు" అంటూ నడక ప్రారంభించా. ఇసక చెప్పుల్లోదూరి, గజిబిజిగా బయటకు వస్తూంది. నా భావాలలో ఆకృతిని దాల్చి, ఆశాదేవి అలా ఎందుకు నిట్టూర్చింది? ఆమెను నా బాధను పంచుకునేటట్లు చేయడంలో న్యాయముందా? నే ఇంతవరకూ వేసిన తప్పటడుగులో ఇదికూడా ఓ తప్పటడుగేనా?–అని ఆలోచించ నారంభించినాయి.

కారు దగ్గిరకు వచ్చింది. వెనకాలఉన్న మిషన్ తీసుకుని, ఆశాదేవి దగ్గిరకువచ్చి, సెల్సుకు కనెక్టుచేసి, మీట నొక్కా. రీలు తిరగడం ప్రారంభించింది.

మొట్టమొదట నేను రేడియోలో వింటున్నప్పుడు రికార్డు అయిన సంగీతం వినపడింది. కొంతసేపటికి టెలిఫోన్ బెల్, ఆ తర్వాత నా గొంతుక ...సంగీతం అయిపోయింది... స్టేషను కట్టేసిన చప్పుడు... ...ఆ తర్వాత నేనువేసిన ప్రశ్నకు నర్మద చెప్పిన సమాధానం దాన్ని తప్పించుకుందామని— "హల్లో ఎప్పుడూరాక"...అన్న నామాటలూ...

"అతను చెప్పడం ఎందుకూ నేను చెపుతాను విను" అంది నర్మద కంఠం.

"నేను నీగురించి అడగటంలేదు నర్మదా" అంది నా కంఠం.

"అనవసరంగా, అసందర్భంగా వాదించలేను క్షమించు. నీవు నాగురించి ఆరా తీయడంలో అన్యాయ మేమీలేదు. నీలో ఆ ఉత్కంఠ కలగడం సహజం. నాకూ ఏనాటినుంచో చెప్పాలని ఉంది. ఎవరితోనో ఎప్పుడైనా చెప్పాలి. ఎందుకంటే నాలోని పరిస్థితులు సన్నెం చేస్తాయో, ఆ పరిస్థితిలో బహిర్గత వాతావరణంలో నేనెలా ప్రవర్తిస్తానో నాకు తెలియదు. నేను పిచ్చిదాన్ని కాకముందే, ఎవరితోనో ఒకరితో చెప్పుకుందామని ఎంతో కాలంనుంచి ఆవేదన పడుతున్నా. నా జీవితంలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్న నీవే ఆ వ్యక్తి కావడం నా అదృష్టం"...అంటున్న నర్మద కంఠానికి అడ్డుపడుతూ "ఇప్పుడవన్నీ ఎందుకు నర్మదా! ప్రయాణం చేసి వచ్చావు. అలసట తీర్చుకున్నాక మాట్లాడుకుందాంలే" అంది నా కంఠం.

"శరీరానికి విశ్రాంతి నివ్వగలను కానీ, మనస్సుకు ఎలా విశ్రాంతి నివ్వాలో తెలియదు రాజూ! లాభంలేదు. నాకథను నీకు చెప్పనీ. ఈ కథను ఎలా ముగింపు చెయ్యాలో నాకు తెలియటంలేదు. స్వయంగా నిర్ణయించుకునే ధైర్యం నా అంతరాత్మ కోల్పోయింది, ఈ సంగ్రామంలోనే చచ్చిపోయినాసరే ఈ బాధను ఈ నిర్లిప్తతను గెంటాలి. ఏం భయపడుతున్నావా? లాభంలేదు రాజూ! నీవు వినాల్సిందే. ఈ దావానలపుజ్వాలలలో నీవుకూడా మాడిపోవాల్సిందే. ఒకరు రాసిన దానిని చదివి చిలక పలుకులు పలికేదాన్ని, నాకు నేను

మాటలు కూర్చుకుని పలికేశక్తిని కోల్పోయా. నే చెప్పే దాంట్లో తప్పులుండొచ్చు, వావివరుసలు లేకపోవచ్చు, వ్యాకరణం పొల్లు పోవచ్చు. తెగించిన ఆడది అందులో పిచ్చది వాగుతుందనుకో. ఇంకవిను. పూర్తి అయ్యాక నీ కేమన్నా సందేహాలుంటే అడుగు, అంతేకానీ మధ్యలో అడ్డు రాకు. పూర్తిగాఅయ్యాక, నీవంతావిన్నాక నీవేమీమాట్లాడ లేవని నాకు తెలుసు. నీ సమాధానం నాకు వారం రోజుల్లో ఇయ్యి. ఇంకవిను.

నాన్నగారు పోయాక మేము చాలాపాట్లు పడ్డాం. నా చదువు ఆగిపోయింది. సర్దాకి నేను నేర్చుకున్న నృత్యం మాకు కూడుపెట్ట నారంభించింది. మన ఆంధ్రదేశంలో నృత్యాని కున్న ఆదరణ, వాటిమీద ఆధారపడి ఉండే వ్యక్తుల విలువ ఎటువంటిదో నీకు తెలుసు. ఈ కలుషిత వాతావరణంలో, నేనూ మా అమ్మా నాన్నగారి ఇన్సూరెన్సు డబ్బుపెట్టుకుని, నాలుగేళ్ళు గడిపాం. వచ్చేడబ్బు మా తిండికి, తిరుగుడికీ సరిపోయేది. లేనినాడు కడుపులో కాళ్ళు పెట్టుకుని ఏ చెట్టు క్రిందో, ఏ సత్రంలోనో పడుకునేవాళ్ళం. ఆరోజుల్లో నాపేరు నర్మద కాదు విజయ. ఆ రోజుల్లో–మా ఆలోచన్లు ఒక గడి చుట్టూ తిరిగేయి. ఆ గడిలో డబ్బు ఎలా సంపాదించాలి? జనాన్ని ఎట్లా మెప్పించాలి? మానం పోకుండా ఎలా పెద్ద తల కాయల్ని బుట్టలో వేసుకుని ఊళ్లో మాకు ఆసరాగా ఉంచు కోవాలి? జీవితాన్ని ఎలా గడపాలి? ఈ ఆలోచనలుండేవి.

ఇలా నాలుగేళ్ళు గడిచిపోయినయి. ఆ అనుభవంతో ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనగలననే ధైర్యం వచ్చింది నాలో. నా వ్యక్తిత్వంమీద నాకు నమ్మకం కలిగింది. ఇలా నెల్లూరు చేరాం. అమ్మకు అక్కడ జబ్బుచేసింది. ఈ తిరుగుళ్ళలో, రోజు రోజుకు మారే నీళ్ళకు, వాతావరణానికి, పరిస్థితులకు, ఆమె శరీరం తలొంచింది. ఆరోజు కడపలో ఆఖరి నృత్య ప్రదర్శనం. ఆమెకు జ్వరం ఎక్కువయ్యింది. ఆమె కోసం కూర్చుంటే ప్రదర్శనం ఆగిపోతుంది. ప్రదర్శనం ఆగిపోతే ప్రజలు నన్ను నాశనం చేస్తారు. ఇంతకాలం నేను నిర్మించుకున్న నా మేడ కూలిపోతుంది... రాజూ జీవితంలో మొట్టమొదటి సారిగా ప్రేమకు కర్తవ్యానికి సంఘర్షణ జరిగింది.

జయం కర్తవ్యానికి లభ్యం అయ్యింది. నృత్యం జయప్రదంగా జరిగింది. ప్రజలు చప్పట్లు కొట్టారు. తెరదిగింది. ఇంతలో ఒకవ్యక్తి ఒక కాగితం తీసుకొచ్చి సంతకం పెట్టమన్నాడు. అది సినిమా కాంట్రాక్టు. ఆ కాగితంమీద అక్కడే సంతకంపెట్టి గ్రీన్ రూములోకి పరిగెత్తా — అక్కడ మేకప్ టేబిల్‌మీద తలవాల్చి అమ్మ నిద్రపోతున్నది. ఆమెను లేపడం ఎందుకని, మేకప్ కడిగేసుకుని, చీర మార్చుకుని, ఆమెను లేపుతూ, అమ్మా మన కష్టాలన్నీ తీరిపోయాయి. సినిమా కాంట్రాక్టు దొరికింది అన్నా. అమ్మ పలకలేదు. అంతే రాజూ! అమ్మ చల్లబడిపోయింది-చచ్చిపోయింది.

నా జీవితపు అదృష్ట శిఖరాలెక్కే ముందు, మొట్ట మొదటి మెట్టులోనే అమ్మ నన్ను ఏకాకినిచేసి వెళ్ళిపోయింది. ఆయనతో వచ్చేసా. ఆయన పేరు వెంకట్రావు. స్వగ్రామం ఫూళ్ళ.ఫిలిం ప్రొడ్యూసర్. వారింట్లోనేనామకాం. వారిభార్యకు నా వయస్సే ఉంటుంది. ఆమెకంటే నాలుగేళ్ళు పెద్దవారాయన. క్రొత్తగా ఫిలిం రంగంలో అడుగు పెట్టారు. నా మొట్ట మొదటి చిత్రంలో నృత్యంచేసా. ఆంధ్రలోకం గుడ్డిగా పొగిడేసింది. అంతకంటే గొప్పగా నేను ఊరూరా నృత్యం చేస్తే, నా కళను గుర్తించలేదు. ఈనాడు నా బొమ్మనుచూసి గుమ్మయిపోయారు. ఈలోపుగా వెంకట్రావుగారి భార్య విషం త్రాగి చనిపోయింది. ఎందుకో తెలుసా రాజూ? ఆయనకూ నాకూ సంబంధం ఉందని రూఢి పడిందట. అందుకని మా త్రోవలో ఉండటం ఇష్టంలేక వెళ్ళిపోతున్నదంట. చచ్చిపోయింది-పిచ్చితల్లి అప్పటికి నేనింకా కన్యనే అని చెప్తే నమ్మేదా? ఏమో?... కానీ ఆమె చచ్చిపోయింది. ఆమె తన భర్తకు రాసిన ఉత్తరం నా చేతిలోపడింది. అది ఇంకెవరి చేతిలోనైనా పడితే, అది బయటకువస్తే, లోకం నన్నేం చేస్తుందో నాకు తెలుసు. ఆ ఉత్తరాన్ని చించేశా...

నేను మళ్ళీ నర్మదగా మారా...నాపేరుతోపాటూ ఆయనా మారారు. భార్యను మరిచిపోదాం అనే ఆశతో ఆయన త్రాగుడు అలవాటు చేసుకున్నారు. ఒకరోజు నన్ను

ఆ మైకంలో బలాత్కారం చేశారు. నా ఉడుకు రక్తం, ఆయనమీద ఉండే కృతజ్ఞత, అభిమానం, జాలి వారికి సహాయం చేశాయి. ఆ మరుసటిరోజు మేమిద్దరమూ ఆర్య సమాజంలోకి వెళ్ళి పెళ్ళి చేసుకున్నాం. భార్యా భర్తలుగా మారాం. ఆశ్చర్యపడకు రాజూ. నాకు పెళ్ళి అయ్యింది భారత దేశపు కన్య ఎవరికోసం తన సంపదనంతా మూటకట్టుకుని, ఎదురు చూస్తుందో, వారు దొరికారు. అఫ్‌కోర్సు ఒకరోజు ముందే విచిత్ర పరిస్థితిలో ఆ సంపద వారికి అర్పించాననుకో. ఏలాగైతేనే నేను పరిపూర్ణ స్త్రీ అయ్యాను. ఒకరిజీవితంలో పత్నిగా అడుగుపెట్టాను. జీవితం నందనవనంగా మారింది. ఇంతలో ఆయన తీసిన పిక్చరు ఫెయిల్ అయ్యింది. పరమ పద సోపానపటంలో పైకంటూ వెళ్ళి క్రిందకు జారిపోయారు. ఎనిమిది లక్షలు చేతిలోంచి వెళ్ళిపోయాయి. డబ్బాలు తిరిగి వచ్చేసాయి. మళ్ళీ త్రాగుడు తన బిగికౌగిలిలోకి వారిని తీసుకుంది. ప్రతీ భారతస్త్రీ తన భర్తకోసం ఎన్ని పడరానిపాట్లు పడుతుందో అన్ని బాధలూ పడ్డాను. కానీ మళ్ళీ వారా తల్లి కౌగిలిలోంచి బయటకు రాలేదు.

మాజీవితం చాలాకొద్దిమందికే తెలుసు. ఐనా వారిని చూసి ప్రొడ్యూసర్లు జంకుతున్నారు. ఒకాయన ఈ విషయం పైకెత్తితే పేపర్లు ఊరుకుంటాయా? అన్నాడు. నాపని ఇరకా

టంలో పడింది. అటు ఇతనే నా భర్త అని పైకి చెప్పలేను. ఇటు ఆయన్ను ఏమీ అనలేను

జీవితంలో రెండోసారి ప్రేమకు కర్తవ్యానికి జరిగిన సంఘర్షణలో కర్తవ్యానికే జయం కలిగింది. నా స్వార్థం అనుకో, మరింకేమన్నా అనుకో. ఆయన్ను తీసుకువెళ్ళి, పెరంబూరులో వారికైకొన్న ఇంట్లో పెట్టా. అవసరమైనప్పుడల్లా పాండుచ్చేరి వెళ్ళి వారికి బ్రాందీ తెచ్చి యిచ్చేదాన్ని. పత్రికలవాళ్ళ కళ్ళలో పడకుండా అతి జాగ్రత్తగా వెళ్ళి ఆయన్ని కలుసుకొని వచ్చేదాన్ని. నేనెంత పెద్ద తారనయినా ఆయనకు నేను విజయనే. బూడిదలో పొర్లుతున్న నన్ను ఆకాశంమీదకు ఎత్తారు. కానీకోసం కక్కుర్తి పడేదానికి లక్షలు అందించారు. నా జీవితమే మార్చారు. ఆయన మాసిపోయాగు. ఆయన్ను మర్చిపోదామని నేనెన్నడూ ప్రయత్నించలేదు ఆయన నా భర్త. నా జీవనజ్యోతి. అలాగుండేవి ఆరోజుల్లో నాభావాలు. ఆయన నన్ను, నా పరిస్థితిని పూర్తి అర్థం చేసుకున్నారు. ఇంట్లోంచి బయటకు వచ్చేవారు కారు. ఫలానా సినిమా తార భర్తనని చెప్పుకునేవారు కాదు. నేను వెళ్ళగానే ఆదరంతో ఆహ్వానించేవారు. గతించిన రోజులు గుర్తుకు తెచ్చుకుంటూ, నవ్వుకుంటూ త్రాగాలనిపించినప్పుడు త్రాగేవాళ్ళం. మర్చిపోయిన నా నృత్యాలకు ఆయన కౌగిలిలో ఒరవడి

దిద్దుకొనేదాన్ని.అలా నాకలవాటయింది ఆజీవితం. జీవితంలో ఒకవిధమైన నిర్లక్ష్యత అలవడింది.

ఈలోపుగా నీవు వచ్చావు. నా జీవితం మార నాగం భించింది. నీ స్నేహంలో లభించిన ఆనందం ఆయన సాన్ని ధ్యంలో కొరవడింది. ఆయన దగ్గరకు వెళ్ళడం మానివేశా. డబ్బుమాత్రం పంపించేదాన్ని. అలా నీకు తెలియకుండా గడి పాను. ఒకరోజున ఆయన మద్రాస్ వచ్చారు. రాయపురం బీచిలో మేం మాటాడుకోవడం ఆశ చూసింది. ఆరోజే చెప్పు దామని అనుకున్నా. కాని పరిస్థితులు, సమయం సానుకూల పడలేదు. ఆ తర్వాత బొంబాయి వెళ్ళేముందు పెరంబూరు వెళ్ళా. స్త్రీకి జీవితంలో జరగకూడ నటువంటి అవమానం జరి గించి అందరి ఎదుటా. చచ్చిపోయిన అభిమానాన్ని మరచి పోదామని తప్పత్రాగి యింటికి వచ్చా. నీవది చూశావు. మరుచటిరోజే బొంబాయివెళ్ళి మళ్ళీతిరిగివచ్చేసరికి నాగురించి, నా గత చరిత్రగురించి ఆరా తీస్తున్నావని తెలిసింది. ఇదీ నా కథ రాజూ! ఇప్పుడివ్వాలి నీ సలహా. త్రాగుమోతయిన భర్త నేం చెయ్యాను? అలాగే వుండనీ అని వుంచేస్తే పత్రికలవాళ్ళకు తెలిస్తే అప్పుడు జరిగే పరిణామాలను ఎలా ఎదుర్కోవాలి!

ఈ సమస్యలను ఎదుర్కొందామని ఎన్నటినుంచో ప్రయత్నిస్తున్నా. కానీ సమాధానాలు దొరకలేదు. ప్రతీ దానికీ ఏదో అడ్డువస్తుండేది. ప్రతి అడుగుకీ విమర్శచేసుకో

వలసి వచ్చేది. ఎవరికి చెప్పుకుందామన్నా భయమే. ఏమని చెప్పుకోనూ? అతను నన్ను కొడతాడు, త్రాగుబోతు అని చెప్పుకోనా? ఒకవేళ చెప్పినా, ఇంతకాలంనుంచీ లేనిభర్త ఇప్పుడెక్కడ్నుంచి వచ్చాడంటే ఏమని సమాధానం చెప్పేది? కనీసం అలా చెప్పుకోలేకపోతే, అతను త్రాగుబోతు అని అసహ్యించుకోనా? అలా చేయలేకపోయాను రాజూ! అతనంటే నాకు జుగుప్సలేదు, అసూయవుంది. కనీసంఅతను ఆ త్రాగుడు లోనన్నా జీవితాన్ని, ప్రపంచాన్ని, సంఘాన్ని మరచిపో గలుగుతున్నాడు. వికాసంలేని జీవితంకంటే అదేనయంకదూ! అతని దగ్గరకు వెళ్ళకూడదనీ, అతనికి చిల్లికానీకూడా ఇవ్వ కూడదనీ అనుకునేదాన్ని కానీ అలా చేయలేకపోయా. ఖర్మ. స్త్రీ జీవితం అంతేనేమో. భర్తలేకపోతే చుక్కాని లేని పడ వలా కొట్టుమిట్టాడు కుంటుంది. కనీసం నీవన్నా ఆదుకుంటా వని ఆశించా. కానీ నీలో ఆ ధైర్యంలేదు. బాధ్యతలను మోయలేవు కానీ బాధ్యతలను తప్పించి, వాటివల్ల కలిగే ఆనందం అనుభవించడానికి ఆత్రుతపడతావు అని తెలిసేసరికి నాకేం చెయ్యాలో తోచలేదు. అందరికీ ఒలిచిన అరటిపండు లాంటి జీవితం రాదు రాజూ! జీవితంలో మనప్రవర్తన మీద మనం ఒక స్థిరనిశ్చయం ఉంచుకోవాలి—అంతేకాని మన ఆలో చనలతోపాటు మన ప్రవర్తనకూడా మారనీయకూడదు.

వేసింది తప్పటడుగయినా - దాన్ని మనం సమర్థించుకోవాలి. అంతేకాని గుడ్లమీది కోడిలా ఆ తప్పటడుగు దగ్గిరే కూర్చుంటే జీవితంలో పిరికివాడి క్రింద జమ అవుతాను. క్షమించు రాజూ! నీకంటే నాకు యెక్కువ తెలుసునని నేను నీకు చెప్పటం లేదు. ఇంక నా స్వవిషయం. ఇప్పుడు నన్నేం చేయమంటావో చెప్పు? నా ప్రగతికి చుక్కానిగా ఉంటానని భరోసా యిస్తే ఆయన్ని తొలగించేద్దాం. ఆశ్చర్య పడమాకు. నాలో ఆ ధైర్యం ఉంది. లేదూ ఆయన్ను తీసుకొని ఎక్కడికన్నా వెళ్ళిపోనన్నా వెళ్ళిపోతా. లేదూ ఆయనను విడాకులివ్వమంటావా? ఇస్తే వచ్చేపరిణామాలను ఎదుర్కొనేందుకు నీవు కూడా నాతో నడుంకట్టి నిలబడుతావా? నా జీవితం అంతా నీ ముందు పెట్టాను. ఆలోచించి ఒక సలహాను ఇవ్వు. నీవు చెడ్డసలహా యిచ్చావని బాధపడను. నిన్ను బాధ పెట్టను. ఆలోచించు వస్తా వారం రోజులు వ్యవధి తీసుకో! నన్మద గొంతుక ఆగిపోయింది...కొంతసేపటికి ఆశ టేపు రికార్డును ఆఫ్ జేసింది.

చుట్టూ నిశ్చల నిశ్శబ్దత. సముద్రం అలలు సవ్వడి లేకుండా ఆడుకుంటున్నాయి—వెన్నెల పుచ్చ పువ్వులా ఉన్నది.

ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "ఏమంటారు ఆశాదేవీ!" అన్నా.

"నేరాసిన ఉత్తరం చదివారా" అని అడిగింది ఆశ.

"లేదు, దాని సంగతి అలా ఉంచండి. దీన్నిగురించి ఏమంటారూ?" అని నొక్కి అడిగా.

"నా సమాధానం, మీరు నా ఉత్తరం చదివాక ఇచ్చే సమాధానం మీద ఆధారపడివుంటుంది" అంది ఆశ మెల్లిగా.

"ఏం?" అన్నా.

ఆ ఉత్తరం చదివితే మీకే అర్థం అవుతుంది. దయ ఉంచి, ఆ ఉత్తరం చదవండి. అంతవరకూ నన్నీవిషయంలో బలవంత పెట్టకండి" అంది ఆశ లేచి.

మౌనంగా గడిపాం. ఆ తర్వాత ఆశను ఇంటివద్దదింపి, ఇంటికివచ్చి, స్నానంచేసి పక్క మీద పడుకున్నా.

రాజ్యలక్ష్మివచ్చి గుమ్మందగ్గిర నిలబడింది.

"ఏమండీ?" అన్నా.

"నర్మదగారిగురించి మీరేం ఆలోచించారూ?" అని అడిగిందామె.

"అంటే"—అన్నా.

"నర్మదగారు నా కంతా చెప్పి మీ దగ్గరకు వెళ్ళమన్నారు. ఆమె జీవనగతిని మార్చేముందు నేనూ-నా తల్లి ఆమె మీద ఆధారపడి వున్నాం - అనీ ఆమెతో పాటు మా

జీవితాలు కూడా మారతాయి అని ఆలోచించండి" అంది రాజ్యలక్ష్మి.

"క్షమించండి. మీరేమి విన్నారో నాకు తెలియదు. మీరేం చెప్పినా అర్థంచేసుకునే పరిస్థితిలో లేదు నా మనసు" అన్నా చికాకుగా.

"మంచిది. స్థిమితంగా ఆలోచించండి. ఇదిగో ఆశాదేవి మీకు రాసిన వుత్తరం" అంటూ ఒక కవరును అందించిది.

అది విప్పివుంది. అది చూసి "ఎవరు విప్పమన్నారు మిమ్మల్ని?" అన్నా.

"'మీరు ఎప్పుడూ నా వుత్తరాలు విప్పకండి' అని చెప్పలేదు" అంది రాజ్యలక్ష్మి.

"సరే! వెళ్ళండి" అన్నా.

ఆమె వెళ్ళిపోయింది.

"మైగాడ్! అందరికీ నామీద ఇంత కోపం ఎందుకో? అనవసరంగా కొరివితో తలగోక్కున్నా. ఈ దావానలంలో నేనెక్కడికి కొట్టుకుపోతున్నానో నాకే తెలీటం లేదు" అనుకొంటూ ఆశరాసిన ఉత్తరం తడబడుతున్న హృదయంతో చదవనారంభించా.

రాజుగారూ!

నమస్తే. విచిత్ర పరిస్థితులలో, విభిన్న భావాలతో నేనీ ఉత్తరం రాస్తున్నా. మీది కవి హృదయం. సాను భూతితో ఈ ఉత్తరం చదివి దీనికి సమాధానం ఇవ్వండి.

జీవితంలో మనకి తెలియకుండా, పరిస్థితులు పరిసర వాతావరణం, కొన్ని నిర్ణయాలు చేశాయి. నాటికి నేను తలొంచక తప్పలేదు. అది నా బలహీనతకాదు సుమండీ! నా ఓటమి మాత్రమే. మీ మనస్తత్వం, మీ బలహీనతలు అర్థంచేసుకోనికూడా మీకు ఈఉత్తరం రాయడం తప్పలేదు. ఇలా చేయడంవల్ల మీకు తప్పకుండా బాధ కలుగుతుంది. ఆ పరిస్థితిలో నా జీవితంలో ఎటువైపు మొగ్గుతుందో, నే ఊహించుకోకుండా ఉన్నాను. నా జీవితచదరంగంలో పావులై పరిస్థితులు, సంఘం ఆడుతున్నాయి. ఇంద్ర ధనుస్సులాగా మిథ్యా జీవితాన్ని చిత్రించుకున్నాయి. ఇంద్రధనుస్సు, నీటి బిందువుల పరావర్తనము అంటే నమ్మరు. అలానే నా జీవితం విలువయింది గాదు. అనవసరంగా దానికి రంగులు పూస్తున్నాను అంటే నమ్మలేదు. నమ్మించడానికి సర్వప్రయత్నాలూ చేసాను. కాని ఓడిపోయాను. ఇంక మిమ్మల్ని విసుగెత్తించను. మన స్నేహాన్ని పర్యాలోకించ నవసరంలేదు అనుకుంటా. కాని ఒక చిన్న సందేహం. లోకం చిత్రించే సంబంధాన్ని మీరు ఆలోచించారో లేదో అర్థం కావడం లేదు. ఒకటి మాత్రం నిజం మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నా— ఆ ఆలోచన నాలోపలే వుండివుండాలి. లేకపోతే ఈ నాడు లోకం అనే మాటలకు నా ఆత్మ ఎదురు తిరగాలి. అలా జర

గటం లేదు. నా ఉద్దేశ్యంలో కూడా లోకం తప్పటడుగు వేయలేదు. మీరనచ్చు. దానికి విశాల హృదయం లేక మన స్నేహాన్ని తప్పుగా అర్థం చేసుకుందీ అని. కానీ మన సంప్రదాయం, ఒక అమ్మాయి, అబ్బాయి కలిసిమెలిసి తిరిగితే వారు తిరిగే సమయాన్నిబట్టి, వ్యవధినిబట్టి, వారిద్దరిమధ్యనున్న సంబంధాన్ని నిర్ణయించుకొంటుంది. ఈలోపుగా వారి జీవితాలు తప్పకుండా వేరన్నా అవుతాయి, లేకపోతే కలిసన్నా పోతాయి. వారిద్దరి ప్రవర్తనా మంచన్నా అవ్వొచ్చు లేక చెడన్నా అవచ్చు. ఏదేమయినా ఆ ప్రవర్తన తొందరగా మరచిపోలేదు సంఘం. అలాగే మనిద్దరి జీవితాలునూ. కనపడ్డ ప్రతి వ్యక్తి, మీ స్నేహితులు, నా స్నేహితులు ఆ దిన మెప్పుడూ అని అడగసాగారు. ఒకటిమాత్రం గుర్తుంచుకోండి. ఇందులో నా స్వార్థం మాత్రం లేదు. నేను కావాలని ప్రచారం చేయలేదు ఈ గొడవను. అంతనీచత్వానికి దిగజారలేదు నా మన స్తత్వం. అది మాత్రం గుర్తుంచుకోండి. మీరు మగవారు. ఎలా అయినా చలామణి అవగల స్తోమత ప్రకృతి మీకు ఇచ్చింది. అదే మా జీవితంలో వక్రరేఖ గీచింది. మేము వేసే ప్రతి అడుగు జాగ్రత్తగావేయమని ఆజ్ఞాపించింది. అలాగే నేనూనూ. ఇంతవరకూ నేను ఏ విషయంలోనూ తప్పటడుగు వేయలేదు. మీ స్నేహంలో నేనువేసింది తప్పటడుగు కాదు. లోకం నమ్మిందివేరు – జరిగింది వేరు. వెయ్యి మంది మాదీ ఫలాన్ని వెలగకాయంటే ఒప్పుకోవాలి. అలానే నేనూ వారిచ్చిన నిర్ణయాన్ని శిరసావహించాల్సి వచ్చింది. దాంట్లో నా తప్పేం కనపడలేదు. ఆ నిర్ణయం మీరు కూడా అంగీక

రించాల్సిందని ప్రాధేయ పడుతున్నా. ఈ నా ప్రాధేయతలో నా అరిపోతున్న ఆత్మగౌరవం ఉంది. జీవితంలో నాకుగా నేనేదీ కోరలేదు. నా చుట్టూ ఒక నిర్భేధ్యమైన వలయాన్ని సృష్టించుకొని చిన్నప్పట్నుంచి దాంట్లోనే ఉన్నా. అది నా అహం అనండి మరింకేదయినా అనండి. అలా పెరిగాను. ఈ నాడు మిమ్మల్ని ఇలా కోరడంతో నా అహం దెబ్బతిన్నది. నా వ్యక్తిత్వం నా మీద తిరగబడింది. కానీ నేనేం చెయ్యను? పరిస్థితులు అలా చేసాయి. నాకు తటస్థపడిన పరిస్థితులను సహృదయంతో అర్థంచేసుకోండి. మీ చేతిలో పెట్టిన నా జీవితానికి ఓ నిర్వచనం ఇవ్వండి.

నా పరిస్థితిని తెలుచుకుని అమ్మ కన్నీరు పెడుతుంటే "అమ్మా కన్నీటితో కడగండ్లు కొట్టుకుపోయె రోజు లుండేవి అని విన్నా. కనలేదు. చూడండి నమ్మలేని రోజులివి. ఎందుకమ్మా ఈ అనవసరపు బాధ? మనవ్యక్తిత్వాలను కించ పరుచుకోడం ఎందుకమ్మా?" అంటే అమ్మకు అర్థంకాదు. ఆవిడ మనస్తత్వంవేరు. అటు ఆమెలో ఛాందసత్వంలేదు, ఇటు అధునాతనత్వం లేదు. అటు లోకం అనే మాటలు విన కుండా ఉండలేదు. ఇటు మనస్సు అర్థం చెప్పి, విడమరిచి విన రించే మాటల్ని నమ్మలేదు. ఇదీ మా అమ్మ పరిస్థితి.

ఇటు మా అన్నయ్య నన్నేమీ అనలేదు. అటు స్నేహి తులు అడిగే ప్రశ్నలకు సమాధానం ఇవ్వలేడు. మధ్యస్తంగా అతని బాధ అతనిది.

ఇరువురి వ్యక్తిత్వాలు వేరయినా ఒకే విధంగా బాధ పడుతున్నారు. ఒక్క జీవితం కోసం వారునన్ను పెంచారు.

నేను ఆడిన ఆటకు తాళంవేసారు నా వ్యక్తిత్వంమీద అధికారం చేద్దామనిఅనుకోలేదు. ఈనాటికూడా వారు నన్నేమీ అనటంలేదు· వారి హృదయ భారం తీర్చే బాధ్యత నాకు లేదూ-అది నా వ్యక్తి ధర్మం కాదూ మీరే చెప్పండి. మీరు అంగీకరిస్తే, ఇంతమంది హృదయాలను తేలికపరిచిన వారవుతారు. వారి హృదయాలలో కాంతి పుంజంలా వెలుగుతారు. మీలోని బలహీనతలు తెలుసు. మీరు నాకు తెలుసు. మీవ్యక్తిత్వానికి అనుగుణ్యంగా, మీ నీడలో, మీ అడుగులో అడుగువేస్తా. నా జీవితం ఏమైనాసరే నా వ్యక్తిత్వాన్ని మీ ముందు ధారపోస్తా. ఇంతకంటే మీకు ఎలా రాయాలో అర్థం కావటంలేదు. నా జీవితంలో మొట్టమొదటి సారిగా విచిత్ర పరిస్థితులలో పడ్డాను నా మనస్సు మీ వైపు మొగ్గుతున్నది. పరిస్థితులు, సంఘం మీవైపు నన్ను వేలెత్తి చూపించారు. అంతే నా జీవితం ఒక సముద్రంలా, సుడిగుండంలాఉంది. అంతా అయోమయం, అంతా కలగా పులగం-నా జీవితం ఏమవుతుంది? నేసేం చెయ్యాలి? ఏం చెయ్యాలి? నా జీవితం ఏమవుతుంది రాజుగారూ?

మీ ఆశ.

నా చేతిలోని కాగితాలు జారిపోయాయి. గుండెలు మండుతున్నాయి. ఆవిర్లు కక్కుతున్న నా శరీరం, విశ్రాంతి కోరుతున్నది. ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి? ఈ ప్రశ్న నా మెదడులో లెక్కలేనన్నిసార్లు మెదలసాగింది. ఆ కదలిక మెదడుమీద సుత్తిపెట్టి కొట్టినట్లుగాఉంది. ఈ మూడు జీవితాలు ఎలా కూర్చాలి? వాటికి పరిపూర్ణత్వం ఎలా ఇవ్వాల్సి?

కధ రాసేటప్పుడు కధలోని పాత్రలతో ఇష్టం వచ్చినట్లుగా ఆడుకున్నా. చంపా. ఖూనీలు చేయించా. ఆకాసంమీదకు ఎత్తేశా - ఇవన్నీ సమర్ధించుకో గలిగిన వాడ్ని-ఇక్కడ నా ఆలోచన కుంటుబడుతున్నదేమిటీ? సంవత్సరాల తరబడిగా ఎన్నో ఉద్గ్రంధాలు చదివి, ఎంతో విజ్ఞానాన్ని నా కధలలోకి శ్రమపడి ఎక్కించి ఎంతో అనుభవం జీర్ణించుకున్న సమర్ధత ఉన్న నాకు, ఈనాడు ఇలా దురదృష్టాలతో చెలిమిచేసి బతుకుబాటలోని అడ్డంకులను అర్ధంచేసుకుని కూడా వాటిని తొలగించలేని అసమర్ధత నాల్లో ఎలా ప్రవేశించిందా-అని బాధ పడుతున్నాను.

నిజంగా నాలో వారిద్దరూఅనుకునే బలహీనత ఉందా? ఉంటే నాకెందుకు తెలియలేదు?

ఠంగు ఠంగుమంటూ గడియారం పన్నెండు గంటలు కొట్టింది. ఆలోచనలు ఆగిపోయాయి. కళ్లు మండుతున్నాయి. సిగరెట్టు వెలిగించా. నిద్రాదేవి కలతబారిన నా ఆలోచనలకో లేక నా భయంకరమనఃప్రవృత్తికో జడిసి నానుంచి దూరంగా పారిపోయింది. లైట్లు ఆర్పా భయంవేసింది. చీకటి—అంతా చీకటి. మళ్లా లైటు వెలిగించా. ఎక్కడికన్నా పారిపోవాలని పించింది. వెంటనే లేచి కారెక్కా. కానీ ఎక్కడికి వెళ్ళను? ఈ ప్రశ్న నన్ను తెల్లవార్లూ వెంటాడుతూనే వుంది. సూర్యుడు ఉదయించాడు. కారు మహాబలిపురం రోడ్డుమీద వెళుతున్నది. అక్కడికి వెళ్ళేసరికి తొమ్మిది అయ్యింది. వికలమైన మనస్సులా చెల్లాచెదురుగాఉన్నాయి ఆ శిధిలాలు. ఆ గుహల్లో, రథచక్రాల నీడల్లో ప్రాచీనవైభవంకంటె నా దుర

దృష్టదేవత వికటాట్టహాసంవినిపించింది. ఎవరో కాలేజీ అమ్మా యిలుపిక్నిక్ కి వచ్చారు. నేనో రాతిచాటునకూర్చుని వారిలో వున్న ఆనందం, నవ్యత్వంచూడసాగాను. నవ్వుకుంటున్నారు, పాడుకుంటున్నారు, కథలు చెప్పుకొంటున్నారు, కాలేజీ రోమియోలమీద విమర్శలు విసురుకొంటున్నారు. అప్పుడే వికసించిన పుష్పాలని, వారిలో వున్న ఆ ఆనందం నాలోని అసూయను రేపింది. నాకే శక్తివుంటే వారిలోవున్న ఆవుత్సాహాన్ని కసిదీరా నలిపివేసేవాడిని. ఈ నాలోని అక్కసుని చూచి నేనే అసహ్యించుకున్నా. ఇంక అక్కడ ఉండబుద్ధి వేయలేదు. నెమ్మదిగాలేచి వారికి కనపడకుండా వెళ్ళి కారులో కూర్చున్నా. వెనక సీటులో టేప్ రికార్డరువుంది మళ్ళీ సర్మద సంభాషణ విన్నా — అలాగే మధ్యాహ్నము వరకూ ఉన్నా. ఇంక మార్గం కనపడ లేదు. అక్కణ్నుంచి బయల్దేరా. విశాలంగాఉన్న పచ్చటి చెట్లని చూస్తూ నెమ్మదిగా కారు నడుపుతున్నా. ఎదురుగావస్తున్న లారీ డ్రైవర్లు నా కారు నత్తనడకను చూసి నవ్వుకుంటున్నారు. ఒకనాడు వాళ్ళను చూసి వికసించని మనస్సులు, అని అనుకుని నవ్వుకునేవాడ్ని. ఈనాడు వారి ఆనందం చూచి బాధ పడుతున్నా, వారిలో పరిపూర్ణత లేకపోయినా సంతృప్తిఉంది. నాలో అదీ లేదు. నాకే పెద్ద తెలుసు అనేభావం బలిసిపోయి, అహంకారం ప్రబలి, ప్రకృతికి మించిన. శక్తికై ఆశలుపడ్డా ఆ ఆశ నిరాశయిపోయేసరికి, క్రిందకు దిగజారిపోయా. నా పతనం ఈనాడు వెక్కిరిస్తున్నది. నాలోని ఈ వైరుధ్యాన్ని జయించాలి, జయించాలి, జయించాలి...కుక్కపిల్ల కెవ్వు

మంది. కారు ఆపాను. క్రిందకు దిగా. కారువెనకాల రక్తపు చారలు. ఆరక్తపు చారలకు దూరంగా... వెనకగా...రక్తపు మడుగు. దాంట్లో గిలగిలా కొట్టుకుంటున్న కుక్కపిల్ల... మళ్ళీకారులోకి వచ్చి, కారును వెనక్కు పోనిచ్చా:.. వెనక చక్రం మెత్తగా ఎక్కింది. నాచేతులు వణికాయి... ఆక్రందనం ఆగిపోయింది...నిశ్శబ్దత నాముందు కనపడింది. నిశ్చలమైన రక్తపుమడుగు. దాంట్లో నిర్జీవమైన కుక్కపిల్ల. నిశ్శబ్దంగా చూస్తూంది ఆ దృశ్యాన్ని ప్రస్కృతి. సిగరెట్టు పొగ కారులో దాగుడుమూతలాడుకుంటున్నది. దూరంగాఉన్న కుక్కపిల్ల అలానే ఉందా. రక్తపు మడుగులో...ఇంతలో ఓ కుక్క దాని వెనకాల నాలుగు పిల్లలు వచ్చినాయి. ఆ కుక్క పిల్లనుచూసాయి. బహుశా దానిగురించి బాధపడుతున్నాయి. కానీ... కానీ అయిదూవచ్చి, ఎంతో ఇష్టంగా ఆ కళేబరాన్ని పీక్కుని తినసాగాయి. మనస్సు వికలమైంది. ఆలోచన తళుక్కు మంది.

దొమ్మిలో ఒకడ్ని హత్యచేసిన కత్తి, ఇంకొకడి మీదికి ఎలా వెళ్తుందో, ఆపనిచేసిన వ్యక్తికుండే అయోమయమైన మనస్సు, మొండిధైర్యం నాలో ప్రవేశించింది. ఇంతవరకూ నాలోఉన్న అవస్థను బండరాయి వేసి పగలగొట్టినట్లు పగలగొట్టిందా దృశ్యం.

కారు కదిలింది. గమ్యస్థానాన్ని కనుక్కొన్న నా మనస్సు విజృంభించింది. కారు పెరంబూర్ వైపు సాగింది.

అస్తమిస్తున్న రవికిరణాలను వడకడుతున్నాయి నల్లటి మేఘాలు. ఆకాశం నల్లగామారుతున్నది. వర్షం వచ్చే సూచ

నలు కనబడ్డాయి. దూరంగా నర్మద మేడ అంతస్థుకనబడింది. చుట్టూ మామిడితోట. లోపలికి వచ్చేసరికి చీకటి పడింది. అసలే ఆకాశం నల్లటి ముసుగువేసుకుంది. దానికితోడు దట్టంగా ఉన్న చెట్లు. కారాపి, లోపలికివెళ్ళి, ముఖపరిచయమయినా లేని వ్యక్తితో ఏం మాట్లాడాలి? అని నన్నునేను ప్రశ్నించుకున్నా—అవును నిజమె. ఏం అడగాలి?...ఇలా మీమాంసతో గడిపాను. ఇంతలో ప్రకృతి ఒక్కసారి విజృంభించింది. పెద్ద గాలితో వాన ప్రారంభమయ్యింది—ఈ పెనుగాలిలో ఇలా కొట్టుకునేకంటే లోపలికి వెళ్ళడమె ఉత్తమంగా కనపడింది.

పోర్టికోలో కారాపాను.

లోపల కుక్క మొరుగుతున్నది.

అది స్వాభావికంగాలేదు. లోపలికివెళ్ళా. డ్రాయింగు రూములో సోఫాలో ఉన్నాడతను. సోఫాదగ్గిరే కుక్క కూర్చుంది. అది నన్నుచూసి తల వాల్చుకుంది.

"రావుగారూ" అని మెల్లిగా పిలిచాను.

ఆయన పలకలేదు.

దగ్గిరకువెళ్ళి ఆయనను తట్టా. ఆయన కదలలేదు. గుండె మీద చేయివేసా—చాలా బలహీనంగా కొట్టుకుంటున్నది.

చేతులు చూసా—చల్లగా ఉన్నాయి. ఆయనను అక్కడే ఉంచి ప్రక్కగదిలోకి వెళ్ళా. గాలివానకు కిటికి తలుపులు కొట్టుకుంటున్నాయి. అవిమూసి గదిని కలయచూసా. అది పడకగది. వెంకటరావుగారిని తీసుకొచ్చి ప్రక్కమీద పడుకో బెట్టి క్రిందపడివున్న రగ్గు, ఇంకా దుప్పట్లు, అన్నీ తీసుకొచ్చి పూర్తిగా కప్పేశా, ఆపని పూర్తయ్యాక టెలిఫోనుకోసం

వెతికా. కనపడలేదు. బయటకువెళ్ళి, ఊళ్లో ఒక కాఫీహోటలు నుంచి నర్మదకు ఫోనుచేశా - ఇంటివద్దలేదు-స్టూడియోలలో లేదు-ఆఖరికో ప్రొడ్యూసర్ గారి భార్య - అవుట్ డోర్ షూటింగ్ కని వెళ్ళారని, ఇంకా తిరిగి రాలేదనీ, ఎక్కడికి వెళ్ళారో తనకు తెలియదనీ చెప్పింది. అయితే వచ్చినప్పుడు పెరంబూర్ లో ప్రమాదం జరిగిందని చెప్పండి - అని రిసీవరు పెట్టేసి, మందులషాపులోకి వెళ్ళి, కొన్ని మందులు కొనుక్కొని ఇంటికివచ్చా. టేబిల్ మీద అవిపెట్టి, వంటింట్లోకి వెళ్ళి, హీటర్ మీద నీళ్ళు పెట్టి స్విచ్ వేసి, నీళ్ళు కాగేవరకూ అలానే వెచ్చగా కూర్చున్నా. నీళ్ళు మరిగినాయి, ఆ వేడినీళ్ళలో ఇందాక తెచ్చినమందు వేసి, కెటిల్ లోకి వంపుకుని, బెడ్ రూములోకి వెళ్ళి, ఆయనకు ఆవిరిపట్టా. కొంతసేపటికి ఆయన ఒంట్లోవేడి ప్రవేసించిది. బయటవర్షంతగ్గింది. ఆయనకదిలారు. మనిషిచాలా బలహీనంగా ఉన్నారు. అంత బలహీనంగా ఉన్నా, నన్నుచూచి ఆయనలేవబోతుంటే, ఆయన్ను వారించి మీరు లేవకండి. కాఫీతెస్తాను-అంటూ వెళ్ళి, కాఫీ కాచి తీసుకువచ్చి ఆయనకు పట్టించా. ఆయన అది త్రాగాక సిగరెట్టు వెలిగించి ఆయనకు ఇచ్చా. ఆయన అది త్రాగుతూ అలానే మంచంమీద పడుకున్నారు. పడక కుర్చీలో కూర్చునున్న నాకు ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలియదు.

ఆయన నన్ను తట్టి లేపారు. గబుక్కునలేచి కిటికీ లోంచి బయటకు చూశా. ఇంకా తెల్లారలేదు.

"రాత్రి మీరు నాకు చేసిన సహాయానికి ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థంకావటంలేదు" అన్నారాయన.



"మీకా పరిస్థితి అలవాటా?" అని అడిగా.

"త్రాగుమోతు చివరిరోజుల్లో అలవాటుకాక మరే మవుతుంది?" అన్నారాయన.

దానికి నేను జవాబు ఇవ్వకుండా నాపేరు రాజ... అని చెప్పబోతుండగా...

"నాకు మీరు తెలుసు...ఎందుకొచ్చారో కూడా తెలుసు... ఈ సమస్యకో రూపం ఇవ్వడానికే నే ఇంకా బ్రతికి ఉన్నా ననుకోండి. నర్మదకు నేను చాలా అన్యాయం చేశా నని నాకు చాలా బాధగాఉండేది. జీవితం అంటే నిర్వచనం చెప్పలేని పరిస్థితిలో ఆమెను ఈ రొంపిలో దించా. త్రాగి, ఆమెవ్యక్తిత్వాన్ని అందరిఎదుట అవమానించా. ఈ పరిస్థితిలో ఆమెనుమీరు ఆదుకున్నారని తెలిసేసరికి నాకుచాలా ఆనందం కలిగింది. మీరు ఆమెలో నేనుచంపేసిన ఆత్మగౌరవానికి మళ్ళీ ప్రాణం పోస్తున్నారు. నేను కాలరాచిన ఆమె వ్యక్తిత్వాన్ని మీరు మళ్ళీ ఉజ్వలింప చేస్తారు. మీగురించి విన్నప్పుడే, మీ, మీద నాకా నమ్మకం కలిగింది. దీనికి మీకు సర్వదా కృతజ్ఞుడ్ని. ఆమె నావల్ల మోసగింపబడింది. ఆమె జీవితం నాతోనే అంతం అవుతుందేమో అనిభయం ఉండేది-ఈనాడు ఆ శంక తొలిగిపోయింది" అన్నారాయన.

నాకు మతిపోయింది.

నే నాశించింది ఒకటి-జరుగుతున్నది మరొకటి.

ఏం చెయ్యాలి ఇప్పుడు? ఏమనిచెప్పాలి ఆయనతో? నామీద నాకే నమ్మకంలేనప్పుడు - ఆయనకెలా భరోసా

ఇవ్వాలి? ఏమని ఇవ్వను? మళ్ళీ మొదటికి వచ్చిందే పరిస్థితి అనుకున్నా.

"ఏమిటీ ఆలోచిస్తున్నారూ? నేనేమన్నా బాధపడతా ననా నేనలా బాధపడను. నా జీవితంలో ఇంకే సమస్యలూ లేవు, సాధించడానికి. ఇంకే ఆనందాలూ లేవు, అనుభవించ డానికి ఆత్మాభిమానం అడ్డుపడడానికి వ్యక్తిత్వపు విలువలూ లేవు. పోనీ నావల్ల జరిగేదేమన్నా ఉంటే, నేను ఈ భూమి మీద ఉన్న ప్రతీ ఘడియా ఆమెకొక యమగండం. అందు కని నా నిశ్చయా నిశ్చయాలతో మీరు ప్రమేయం పెట్టు కొనవలసిన అవసరం లేదు. వెళ్ళండి" అన్నారాయన.

"నామీద పూర్తిగా నమ్మకం ఉంచకండి" అన్నా నేను.

"క్షమించాలి. మీగురించి మీకు పూర్తిగా తెలి యదు. నాలో మీ వ్యక్తిత్వానికో విశిష్టమైన స్థానం ఉంది. అందుకనే అంత ధీమాగా చెప్తున్నా. వెళ్ళండి మీకోసం నర్మద ఎదురు చూస్తుంటుంది. విష్ యూ ఆల్ ది లక్" అన్నారాయన లేస్తూ...

నేను మాట్లాడకుండా బయటకు వచ్చేసా.

వర్షం వెలిసిపోయింది. ఉదయిస్తున్న రవి కిరణాలు తారు రోడ్డుమీద ఉన్న వర్షపు నీటి బిందువులమీద పడి తళుక్కుమని మెరుస్తున్నది.

కారు నడుపుతున్నానన్న మాటేగానీ, కరిగిపోయిన మొండి ధైర్యం స్థానే ప్రవేశించిన పిరికితనం వెక్కిరిస్తుంటే, కంట్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఊరిలోకి వచ్చాక, ఆశ దగ్గి

శ్యామా లేక నర్మద దగ్గరకు వెళ్దామా అని అనుకున్నా. ఎటూ ఒనిశ్చయానికిరాలేక జేబులోంచి ఒక అర్థరూపాయ తీసి టాస్ వేసి, నాణెం చెప్పినట్లు నడచుకున్నా. ఇంటికి వెళ్ళా... నర్మద ఇంకా రాలేదు.

అయ్యరుకు కాఫీ పెట్టమని చెప్పి, స్నానం చేసి, అయ్య రిచ్చిన కాఫీ త్రాగి, ఇంగ్లీషు సిలోన్ పెట్టి, ఏదో ఒకటి జరగాలి అనే ఆత్రుతతో కూర్చున్నా. రాకెట్ వేసేముందు 10, 9, 8, 7...ఇలా లెక్కపెడతారు. అలానేడున్నా. ఇందా కిటి భయం పిరికి తనం నాలో లేదు.

రామమూర్తిగారి రెండో పిక్చరు స్క్రిప్టు చదవనారం భించా... దుర్యోధనుడి జీవిత చరిత్ర అది. పురాణాల్లోది మాత్రంకాదు. అతని క్రౌర్యంకంటే, అతని రాజనీతిని చూపి స్తున్నది ఈ స్క్రిప్టు. దుర్యోదనుడు అంటే దుర్మార్గుడు అనే భావం ఉన్న ప్రేక్షకులు దీన్ని చూస్తే ఏమనుకుంటారో అని అనిపించింది. పూర్తి అయ్యాక, దానిని టీపాయ్ మీద పెట్టి, సోఫాలోనే పడుకున్నా. ప్రశాంతంగా నిద్రపట్టింది.

పన్నెండు గంటలకు లేచి అయ్యరు పెట్టిన భోజనంతిని, కార్మికుల కార్యక్రమం పెట్టుకుని సీతక్క చెప్పిందంతా ఆల కించా. సీతక్క ఎవ్వరోకానీ, చాలా బాగుంటుందామె కంఠ స్వరం. రేడియో కట్టేసి, డైరితీసి, ఇంతవరకూ జరిగిందంతా రాశా.

అయ్యరువచ్చి ఎవ్వరో వచ్చారని చెప్పాడు.

ఇంతవరకూ వేచిఉన్న పరిస్థితులు ముందుకు తోసు కొస్తున్నాయి అని అనుకుని, డ్రాయింగు రూములోకి వెళ్ళా.

ఆశ అన్నగారూ, ఇంకోవ్యక్తీ ఉన్నారు.

"నమస్తే" అన్నా.

"వీరు సుందరరామ రెడ్డిగారని హైద్రాబాద్ వెటర్నరీ కాలేజీలో లెక్చరరు" అని పరిచయం చేసారు. సంజీవరావు గారు గుర్తుకొచ్చి నే చదివేరోజులలో మద్రాసు టూరు వెళ్ళి నపుడు బడేటి వెంకటేశ్వరరావుగారు పరిచయం చేశారు.

మామూలు మాటలయ్యాక, ఆయన ఒక కవరిచ్చి, ఆశ మీకిమ్మంది అన్నారు

అది నేను విప్పి చూడబోతుంటే, "ఆశ ఎక్కడికి వెళ్ళిందో తెలుసా?" అన్నారు సంజీవరావుగారు.

"ఎక్కడికి వెళ్ళడమేమిటీ?" అన్నా ఆశ్చర్యంగా.

"మీకు తెలియదా?" అన్నారు ఆయన.

"నిజంగా నాకు తెలియదు" అన్నా.

"అయితే వినండి, నిన్నసాయంత్రంనుంచి ఆశ కన పడటం లేదు" అన్నారాయన

ఇంక మీ ఉత్తరం చదవండి-అన్నారు సుందర రామ రెడ్డిగారు.

ఉత్తరం చింపా.

రాజుగారూ!

ఆరోజు సంఘటన గుర్తుకు వచ్చినపుడల్లా నాకేం తోచడంలేదు. మీ బలహీనతలు తెలుసుకుని కూడా, నా జీవితం అంతా మీమీదే కేంద్రీకృతం చేసుకుని, మీమీదే నేనాశలు నిలుపుకున్నా. నా పేకమేడలన్నీ కూల్చేశాగు మీను. తిరిగి కట్టుకుందామన్నా పేకముక్కలు కనపడటం లేదు. ఏం

చెయ్యనూ?—ఆత్మహత్య చేసుకోడానికి ఆత్మాభిమానం అడ్డు పడుతూ ఉంది. అందుకని నే వెళ్ళిపోతున్నా. నా ప్రవర్తన గురించి, నా బంధువులు మిమ్మల్ని బాధపెడతారు. అలా జరగకుండాఉంటే ఎంత బాగుండును అనిపిస్తున్నది. కానీ, వారు మిమ్మల్ని ప్రశాంతంగా ఉండనీయరు. వారికి మీ బల హీనతలు తెలియకుండా అలా చేస్తున్నారనుకుని ఊరుకోండి. వారేం చేసినా అవి మీకై నిర్దేశింపబడినవి కావు. ఆ దూషణ లన్నీ మీలో ఉన్న బలహీనతలకు చెందుతాయి. అది మీ తప్పుకాదు ...

కానీ ... కానీ ... మీరు కొంచెం..కొంచెంప్రయత్నించి ఉంటే ... దాన్నుంచి తప్పించుకుని ఉండేవారు ఇందరికుమీరు చెడ్డవారు అవకుండా ఉండేవారు ... కానీ ... మీరు మీరే ... ఇంకొకరెలా అవుతారూ?

మీకంటే చిన్నదాన్ని, మీకు చెప్పగల అర్హత నాలోలేదు. నర్మదగారికి నాఅభివందనములు. ఆమెజీవితాన్ని నా జీవితంలా ముగించకుండా, వారి కథను సుఖాంతం చేయండి-ఇదే నా చివరి ప్రార్థన. మీకా శక్తిని ప్రసాదించ మని భగవంతుడ్ని కోరుకుంటున్నా ...

నాగురించి మీరు విచారించకండి. విధిచూపించిన తోవలో మలుపులుంటాయి అని ఆశించనందువల్లే ఇలా జరిగింది ... ఇంకముందు ... భవిష్యత్తు ఎలావుంటుందో ... ఎలా ఉన్నా నాకుభయంలేదు. ధైర్యంగా ఎదుర్కోగలను. సెలవ్

ఆశ.

ఉత్తరం నా చేతిలోంచి జారిపోయింది. ఆ ఉత్తరాన్ని తీసుకుని సంజీవరావుగారు చదవసాగారు.

రెడ్డిగారు... "ఇదిగో బ్రదర్... అమ్మాయి కనపడక పోయిందంటే నిన్ను ఈ నేలమీద బ్రతకనీయను... ఇది బెదిరింపు కాదు ప్రామిస్" అన్నారు.

వారికేం సమాధానం చెప్పనూ? తలొంచుకున్నా.

సంజీవరావుగారు "నీ ఘడియలు దగ్గర కొచ్చాయి మిస్టర్ రాజూ! రెడ్డికి కోపం వస్తే ఆపిందెవ్వరూ లేరు-ఫో-నీ మొహం మళ్ళీ చూపించకు-ఛీ-ఆత్మాభిమానం అంటూ ఉంటే ఎలా తింటావయ్యా ఇంకా కూడు" అంటూ వెళ్ళి పోయారు.

ఇంక మిగిలింది నేనూ, నన్ను వెక్కిరిస్తున్న నా పరిస్థితీ.

చీకటి పడింది.

ఆశ ఇంటికి ఫోనుచేసా.

ఆశతల్లిగారు పలికారు-ఆవిడ నా గొంతుక వినగానే "నా కడుపుమీద కొట్టావు ఇంకా సంతృప్తి కలగలా? మమ్మల్ని ఇంకా ఎందుకు బాధపెడతావూ? నా ఉసురు నీకు తగలక మానదబ్బాయీ" అంటూ రిసీవరు పెట్టేసింది.

అలవికాని సమస్యలను సాధించి పై అంతస్తుల కెగురు దామనుకునే ప్రతీవ్యక్తీ, ఎప్పుడో ఒకప్పుడు జటిలమైన పరిస్థితులను ఎదుర్కొనక మానడు. అతనిలో ఆత్మస్థైర్యం ఇంకా మిగిలిఉంటే లేచి మళ్ళీ నిలబడతాడు... లేకపోతే... ఈ ప్రశ్నకు నేను సమాధానం ఊహించుకోలేను. ఆ ప్రశ్నను

తలుచుకున్నప్పుడల్లా, భయం వేస్తున్నది-అవును, భయం వేస్తున్నది... ఆలోచనలు ఆగిపోయినయి. ఆశ... నర్మద... వీళ్ళజీవితాలు... ఈ సమస్యలను విడదీయాలి-అవును-విడదీయాలి. కానీ ఎలా? ఏం తోచటంలేదు...

బట్టలు సర్దుకున్నా-నర్మద జీవితం అలానే ఉంచేసి, ఆశకోసం బయిలుదేరుదాం అనుకున్నా... కానీ... నర్మద ఒప్పుకుంటుందా? వెంకట్రావుగారు ఒప్పుకుంటారా? లాభం లేదు-ఈ జీవితం ఇలా బాధపడవలసిందే - కాఫీ కావాలా సార్ అంటూ వచ్చాడు అయ్యరు.

"తీసుకురా అయ్యరూ-బ్లాక్ కాఫీ తీసుకురా" అన్నా కాఫీ తాగుతుండగా-టెలిఫోను మ్రోగింది.

రిసీవరు ఎత్తా... నర్మద కంఠం...

రాజూ! నా భర్త ఆత్మహత్య చేసుకున్నారు రాజూ! నీవు అక్కడకు వెళ్ళావుట. ఏం చేశావు ఆయన్ని?" అని అంది ఏడుస్తూ.

రిసీవరు నాచేతిలోంచి జారిపోయింది. అయిపోయింది-జీవితం ముగిసింది-ఇంక మిగిలిందిచీకటి... చిమ్మచీకటి... సూట్ కేస్ చేతిలో తీసుకున్నా... అవును పారిపోతున్నా-ఎక్కడికి వెళ్తానో నాకు తెలియదు-ఎంతవరకూ ఇలా తిరుగుతానో నాకు తెలియదు-నే చేసిన పని, నన్ను వెంటాడటం మానేశే వరకూ తిరుగుతుంటా-మధ్యలో రాలిపోయేవరకూ తిరుగుతుంటా-చావడానికి చాలా మార్గాలున్నాయని మీరనొచ్చు కానీ-కానీ-చావడానికి కూడా ఆత్మస్థైర్యం వుండాలి కదా!

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B170 |
| పుస్తకం పేరు | నర్మద |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 153 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |